







# ఉపనిషత్తులు

విచారణ

# నిరాలంబోపనిషత్







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: http://www.scribd.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు:sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు*

స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్:

**http://www.scribd.com**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్యాపాదకమల సేవకం।

ప్రబోధానంద వెంకటార్య సద్గురం భజామ్యహం॥

అచలపరిపూర్ణ సిద్ధాంతమును ప్రబోధించు

# నిరాలంబోపనిషత్తు

(శుక్లయజుర్వేదాంతర్గతము)

**(భావార్థ వివరములు)**

సంకలన కర్త

శ్రీ ప్రబోధానంద మల్లు వెంకటార్య రాజయోగి ప్రియ శిష్యుడు

గురుదీక్షాదక్ష

**మంత చిన్నయ్య** ఎం.ఏ., బి.యిడి.



| | | |
|---|---|---|
| వాఖ్యాత పేరు | : | **చిన్నయ్య** |
| ఇంటి పేరు | : | **మంత** (అనగా సమాలోచనా పరుడు,జ్ఞాని,పండితుడు). |
| జన్మస్థలము | : | ఇప్పటూరు, మం॥ నవాబుపేట. |
| జన్మ తేది | : | 05-04-1933. |
| వృత్తి | : | ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు 1953 |
| పదవీ విరమణ | : | జూనియర్ లెక్చరర్ 1991, M.A., B.Ed., |
| ప్రవృత్తి | : | అధ్యాత్మిక చింతన - గ్రంథ రచన |
| ఆధ్యాత్మిక గురువు | : | శ్రీమదచలర్షి ప్రభోధానంద మల్లు వెంకటరెడ్డాఖ్యదేశికులు. |
| బిరుదులు | : | గురుదీక్షాదక్ష, సత్యదర్శనులు, చిన్మయానంద (గురువులచే) |

## రచనలు :

1) కురువిణ శెట్టి వంశ ప్రకాశిక. 2) నీలకంఠ పురాణము - వచనము. 3) గురువాక్యోపనిషత్తు - (భావార్థ వివరములతో) 4) అనన్తోపనిషత్తు - (భావార్థ వివరములతో) 5) సర్వసార పూర్ణోపనిషత్తు (భావార్థ వివరములతో) 6) పరిపూర్ణ ప్రభోదామృతమను కేనోపనిషత్తు (భావార్థ వివరములతో) 7) శ్రీధర స్వామికృత ద్వాదశ శ్లోకములు (భావార్థ వివరములతో) 8) ఓం నమఃశివాయ - అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము - (భావార్థ వివరములతో)

## అముద్రితములు :

1) పరిపూర్ణము, ఎరుక తారతమ్యము - శ్రుతి స్మృతుల ప్రమాణములు - (భావార్థ వివరములతో) 2) శివరామదీక్షిత చూర్ణిక - (భావార్థ వివరములతో)

శ్రీ రామా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మ.నగర్. ఫోన్:246937

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

# నిరాలంబోపనిషత్తు

## ప్రస్తావన

వేదశిరస్సులందుండు ఉపనిషత్తుల ప్రధాన లక్ష్యము నిరపేక్షకమైన, శుద్ధ నిర్గుణమైన, సర్వలక్షణ విలక్షణమైన, ఆత్మాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును నిరాలంబము ను లక్ష్యలక్ష్యార్థముగా తెలిపి జన్మరాహిత్యమును సిద్ధింపజేయుటయే. అందుకు నిరాలంబోపనిషత్తు ఒక చక్కని నిదర్శనము.

"నదేర్థా తోర్వి శరణ గత్యవ సాధనార్థస్య ఉపనిపూర్వస్య, క్విప్ ప్రత్యయాంత స్వరూపమిదం ఉపనిషత్" అని శ్రుతి వాక్యము. 1. విశరణము గతి, అవసాధన మను నర్థము గల సద్ ధాతువునకు వెనుక 'ఉప' 'ని' యను ఉపసర్గల ముందు క్విప్ అను ప్రత్యయము చేరి ఉపనిషత్ అను రూప మేర్పడెను. (భవబీజము) విశరణ = శిథిల మొనర్చి అచల పరిపూర్ణ పరబ్రహ్మము (నిరాలంబము) ను గతి = అపరోక్షమొనర్చి జనన మరణాదులను అవసాధనము నాశనముగావించు సామర్థ్యము గలది ఉపనిషత్తు అని శ్రుత్యర్థము.

"నిరాలంబోపనిషత్తు కూడా" **నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతి యః సయద్య సన్యాసీచ, యోగీచ, కైవల్యం పదమష్నుతే"** అనగా అన్వయ వ్యతిరేకముగా ఎవడు ఆలంబమును (ఎరుకను) వదిలిపెట్టి నిరాలంబమును (పరిపూర్ణ పరబ్రహ్మమును) ఆశ్రయించునో అతడే సన్యాసి, (నిస్సంగుడు, అంటి అంటనివాడు) యోగి, అట్టి యోగికి కైవల్యమనగా జన్మ రాహిత్యము సిద్ధించునని అచలపరిపూర్ణ సిద్ధాంతమును మొదటి మంత్రమున నేరుగా సూటిగా ప్రబోధించినది. ఇంత స్పష్టంగా అచల పరిపూర్ణ సిద్ధాంతమును ప్రబోధించిన ఉపనిషత్తు ఇదొక్కటే అంటే అతిశయోక్తి కాదేమో.

శ్లో॥ ఆత్మాన మఖిలా ధారం । త్యక్త్వావాసన యా సహ ।
సదా సుషుప్త్యవస్థస్థే । జ్ఞాన కర్మవివర్జితాత్ ॥

తా॥ అఖిలమునకు ఆధారము, అధిష్ఠానము అయిన ఆత్మ జీవుల యొక్క సంచితమనే కర్మవాసన లన్నియు తన యందు వహించియుండును. ఆ ఆత్మను కర్మవాసనలతో సహ విడిచిన ఇక జ్ఞాస కర్మలనేవి లేక పోవుట వల్ల పరిపూర్ణ పరబాహ్మము (నిరాలంబం) అంతము లేని సుషుప్తి వలెనుండునని శ్రీశ్రీధర స్వామి ప్రబోదించినారు.

ఇక వీరి శిష్యులైన శ్రీ శివరామ దీక్షితులవారు తెనుగన పరిపూర్ణ సిద్ధాంతమును " సర్వకాలం యెరుకకు వెరచి పరిపూర్ణ భావమును అవలంబించితే చాలు వొక్కటే వ్యవహారము, అంతా తానే, తానే అంతా 100 అంతా తానే అని దేహ పతన పర్యంతము యీలాగు యుక్తి వుంటే వ్యవహారమునకు పనిలేదు. ఇది సిద్ధాంతము యిదే సత్యం, ఇదే మహా రహస్యం, మహా గూఢం యేమి లేదు అని నొక్కి చెప్పినారు.

శ్రీ భాగవత కృష్ణదేశికుల చే వ్రాయబడిన సకలవేదాంత సార గ్రంథమున

అచల వాక్యములందు బయలన పరమార్థము, పరిపూర్ణము లయ విక్షేపయును అంటని నిరాలంబం, ఆ నిరాలంబమే బయలని స్పష్టపరిచినారు. ఎరుక లేనిది శుద్ధమైనది నిరాలంబం. నిరాలంబమే పరిపూర్ణ పరబ్రహ్మమని నిర్ణయము. .

ఈ ఉపనిషత్తు రెండవ మంత్రమున 41 ప్రశ్నలు గలవు. వాటికి ఈ ఉపనిషత్తునందే గల మంత్రములలో సమాధానములు గలవు. ఈ ఉపనిషత్తు నందు మూడవ మంత్ర మున మొదట బ్రహ్మేతిచ= ఇది బ్రహ్మము అని కలదు. ఇది బ్రహ్మము అని దానికి మొదట పరిపూర్ణ పరబ్రహ్మముగా తర్వాత దానికే అధిష్టాన చేతన బ్రహ్మముగా వివరములు కూర్చబడినవి. రెండుబ్రహ్మములు ఉన్నావా? అంటే రెండు బ్రహ్మములు ఉన్నవనే చెప్పవలసి ఉండును. అందుకు గాను వేమన " బ్రహ్మ మదుగకున్న బ్రహ్మంబు గనరాదని" స్పష్టపరిచినారు. అనగా ఎరుక బ్రహ్మను వదలకుండా పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షము గాదని స్పష్టపరిచినారు. అదియునుగాక కేనోపనిషత్తు **నేదం అధిదముపాసతే** మనస్సుచే గ్రహింపరానిది మాత్రమే బ్రహ్మమని నీవు తెలుసుకో, దేని సహాయము చేత మనస్సు గ్రహింప బడుచున్నదో ఈ జనులు ఇక్కడ పూజించేది బ్రహ్మము కాదని తేటపరిచినది. కనుక బ్రహ్మేతి= ఇది బ్రహ్మము అను దానికి మొదట పరిపూర్ణ పరబ్రహ్మముగా మరియు తర్వాత అధిష్టానచేతన బ్రహ్మముగా (మంత్రములో తాత్పర్యము నందు పేర్కొన బడినట్లు) వివరించబడినదని గ్రహించగలరు. తక్కిన ప్రశ్నలన్ని ఎరుకకు సంబంధించినవి. పరిపూర్ణ బోధయనగా ఎరుకను క్షుణ్ణంగా వివరించు బోధయేగాని పరిపూర్ణ పరబ్రహ్మమును అంతగా వివరించునట్టిగాదు. ఎందుకనగా నిరాలంబం నందు పంచతన్మాత్రలు లేవు. ఎరుకను (సచ్చిదానంద బ్రహ్మమును) బాగుగా యెరిగి, ఆ యెరిగిన తెలివిని వదలిననే నిరాలంబ అపరోక్షము. ఎవరు లేదు లేదన్న ఉన్నది నిరాలంబమే, ఎందరు కాదు కాదన్న నిరాలంబోపనిషత్తు పరిపూర్ణ సిద్ధాంతమునే ప్రబోధించు ఉపనిషత్తే.

ఇందలి ఎనిమిది తొమ్మిదవ మంత్రములు చాల ముఖ్యమైనవి. ఇందు బంధమోక్షములను గూర్చి పరమ పదము గూర్చి విశేషముగా వివిరించబడినది. పరిశీలించగలరు.

పరిపూర్ణమౌలిక సూత్రములు వెదజల్లు తేజోబిందూపనిషత్తు, నిరాలంబో పనిషత్తు మొదలగు ఉపనిద్రాజములకు గాఢముగా శ్రమించి వాఖ్యానములు వ్రాయవలసినదిగా సర్వసార పూర్ణోపనిషత్తునకు ఉపనిషద్భూషణమను పీఠికవాస్తు శ్రీ **మదచలర్షి సత్యశోధనాచార్య నిత్యానంద కురుబ సుబ్బరాయుదు** గారు కోరియుండిరి. వారి ఆదేశము నా జీవిత భాగ్యముగా తలంచి నిరాలంబోపనిషత్తునకు మా గురుదేవుని మనస్సున నిల్పి భావార్థములు కూర్చితిని, కనుక వారికి అనంతకోటి కృతజ్ఞతా పూర్వకముగా దండ ప్రణామము లర్పించుచున్నాను.

ఈ ఉపనిషత్తు ప్రతి కొంత కాలము వరకు లభించలేదు. మిత్రులు శ్రీ మాణయ్య గారు వారి మిత్రులైన కీ.శే. మేడిశెట్టి రంగయ్య దగ్గర గలదని చెప్పి వారి దగ్గర గల ఉపనిత్ కల్పతరువు అను సంపుటిని ఇప్పించినారు. కనుక శ్రీ మాణయ్య గారికి, మరియు కీ.శే. మేడి శెట్టి రంగయ్య గారి కుటుంబమునకు కృతజ్ఞతాపూర్వకముగా నమస్కారములు.

ఈ ఉపనిషత్తు నందు తప్పులు లేకుండా చూడబడినది. దోషములున్న విజ్ఞులు మన్నించి సవరించుకొని చదుకొనగలరని ప్రార్థన.

ఈ ఉపనిషత్తు కూడా ఫలశ్రుతిని చెప్పింది. ఈ ఉపనిషత్తును ఎవరు గురు ముఖంగా విని కనిన వాడు తప్పక వాయుపూతుడు అగ్ని పూతుడై జన్మ రాహిత్యము పొందెదరు అని చాటినది.

ఈ ఉపనిషత్తునకు భావార్థములు సర్వమానవ సౌభాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధి చేకూర్చుట కొరకు కూర్చబడినవి. అట్టి భావార్థములు మద్గురువులు, **శ్రీమతి మణిమాంబ సమేత శ్రీమదశరీర అచలర్షి ప్రబోధానంద ముల్లు వేంకటరెడ్డాఖ్య దేశికుల పాదపద్మములకు మా అమ్మ నాన్నలను స్మరించి మరొక పూజా పుష్పంగా సమర్పించు కొంటున్నాను.**

**క.ద.13 పునరుక్తి గలిగి యుండిన ! వినికోపము శాయవలదు । వేడుకొనియేదన్..."**
అని శ్రీ దేశికులు చెప్పినట్లు ఇందు పరిపూర్ణబోధను గురించి మళ్ళీమళ్ళీ వివరించినందువల్ల విసుగుజెందకుండ చదువగలరని వేడుకుంటున్నాను. ఎట్లనగా తమ బిడ్డలు చెప్పినదే మరల చెప్పినచో తప్పునియెంచక సంతోషించెదరు. ఎందుకనగా చెప్పినమాటనే తిరుగా చెప్పినందున వాక్యామునందలి విషయము గ్రహించుచున్నాడని సంతోషించేదరు. కాని దోషమని యెంచరు. ఎందుకనగా విషయగ్రాహ్యమే ప్రధానము. అదే పద్ధతిగా గూరుడార్థములు అవగాహనచేసుకొనుటకు దగ్గరగా తెలియుటకు చెప్పినవాక్యములందు పునరుక్తియున్న తప్పుయని యెంచబడదు. బోధ దృఢమగునని తెలియగలరు.

అందముగా అచ్చువేయించి యిచ్చిన శ్రీ **రామా ఆఫ్‌సెట్ ప్రింటర్స్** యజమాని శ్రీ. శ్రీశైలం గారికి కృతజ్ఞతాపూర్వకముగా వందనము లర్పించుచున్నాను.

గురుదీక్షాదక్ష చిన్మయానంద మంత చిన్నయ్య

ఓం
శ్రీ గురుభ్యోనమః

# ఆశీస్సులు

మత్ ప్రియ శిష్యులు ఇప్పటూరి మంత చిన్నయ్య మొదట ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు. తర్వాత కోస్గి ప్రభుత్వ జూనియర్ కళాశాల ఉపన్యాసకుడుగా పదవి విరమణ చేసినారు. వీరు

**శ్లో॥ విద్యాంతం బ్రహ్మవిద్యాంతం వార్తీకాంతం మగోచరం..."**

వార్తీక సిద్ధాంతమునకు అతీతమైన అచల పరిపూర్ణ బోధను భగవద్గీతలోని జ్ఞాన యోగమందు జెప్పినట్లుగా.

**శ్లో॥ తద్విద్ధి ప్రనిపాతేన । పరిప్రశ్నేన సేవయా**
**ఉపదేక్ష్యన్తితేజ్ఞానం । జ్ఞానిన స్తత్వదర్శనః ॥**

అనునట్లు పెద్దల నాశ్రయించి తత్వజ్ఞాన సంపన్నులైరి. వీరు ఇంతకు పూర్వము గురువాక్యోపనిషత్తు, అనన్తోపనిషత్తు, సర్వసార పూర్ణోపనిషత్తు, కేనోపనిషత్తులకు భావార్థములు చక్కగా వ్రాసినారు. ఏనుగు తొండమువలె కదులుచుండు విశ్వము లేదని అనిత్యమని నిత్యమైన, శాశ్వతమైన పరిపూర్ణమున్నదని అచల పరిపూర్ణ సిద్ధాంతమును వివరించినారు. గురు కృపవల్ల ఆత్మోవలబ్ధిపొంది పరిపూర్ణమును అపరోక్షము గావించుకొని చిన్నయ్య **చిన్మయానంద** అను దీక్షనామములు పొందిరి.

**శ్రీమదచలర్షి అమలానంద పాటల పండరీనాథస్వాములవారు** వీరి నిరంతర రచనా శీలతకు వారి హృదయముప్పొంగి **"గురుదీక్షాదక్ష"** అను నామముతో వీరిని అభినందించి ఆశీర్వదించిరి.

ఇప్పుడు లభ్యమగు 108 ఉపనిషత్తుల వరుసక్రమమున 34వ దగు నిరాలంబోపనిషత్తునకు భావార్థములు కూర్చినారు. వీరిని హృదయ పూర్వకముగా ఆశీర్వదించుచున్నాను.

**ప్రబోధానంద మల్లువెంకటార్యులు**

శ్రీ శివరామదీక్షిత గురూప పీఠము,
రాజేంద్రనగరము,
మహబూబ్‌నగర్ - 509001
తేది 10.10.2009

# నిరాలంబోపనిషత్తు

శుక్లయజుర్వేద శాంతి మంత్రము.

శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

ఆ పరోక్షము పూర్ణము, ఈ ప్రత్యక్షము పూర్ణము. ఈ పూర్ణపద్ధతిని వివరించి చూడగ ప్రత్యక్షపూర్ణము ఎండ మావుల జలరూపకముగా లేకుండా పోవుచున్నది. పరోక్ష పూర్ణము శేషించి యుంటూవున్నది. గనుక యిందు నిర్ణయించిన శాంతి ప్రత్యక్షపూర్ణ శాంతికి గాని, ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక యితర విఘ్నముల శాంతి కొరకుగాదు.

పూర్ణమదః – ఈ శాంతి జనన మరణరూప ప్రత్యక్షపూర్ణ శాంతి కొరకు నిర్ణయించినారు. ఎందుకనగా జనన మరణ ప్రత్యక్ష పూర్ణము సప్త విధచైతన్య పద్ధతులుగా ఉపాధుల స్థానములయందు జనన మరణ రహిత పరిపూర్ణ పరబ్రహ్మమే యుండును గాని జనన మరణ రూపచేతన బ్రహ్మము ఎండమావులవంటిదని దాని శాంతి కొరకు ఈ శాంతి ఏడు పూర్ణమను పదములతో కూర్చబడియున్నది. కనుక ఆగమ నిగమ ఉపనిత్సాగర మధితార్థమవలది, జననమరణములు పొందని అచల పరిపూర్ణ పరబ్రహ్మమని నిరాలంబం అని నిర్ణయము.

**మం. శ్లో॥ హరిః ఓమ్. ఓన్నమశ్శివాయ గురవే సచ్చిదానంద మూర్తయే, నిష్ప్రపంచాయ శాన్తాయ నిరాలంబాయ తేజసే, నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతియః సయద్య సన్న్యాసీచ యోగీచ కైవల్యం పదమశ్నుతే. ఏషామజ్ఞాన జన్తూనాం సమస్తారిష్ట శాన్తయే యద్య ద్బోద్ధవ్య మఖిలం తదాశంక్యా బ్రవీమ్యహమ్॥ (1)**

తా॥ హరి ఓం నమఃశివాయ సద్గురువు సచ్చిదానందమూర్తి, ప్రపంచము లేనివాడు శాంతుడు, నిరాలంబుడు తేజోవంతుడునగు హరికి శివునకు నమస్కారము. ఓం ఎవడు సాలంబనమును వదిలి పెట్టి నిరాలంబమును ఆశ్రయించునో అతడే సన్యాసి, యోగి. అట్టి యోగి కైవల్యమును పొందుచున్నాడు. సమస్త అరిష్టములు తొలగిపోవుటకు ఈ అజ్ఞాన జీవులకు బోధింప వలసిన సర్వస్వమును జెప్పు చున్నాను (1).

<u>వివరములు:</u> (సంభాషణ) రూపము.

**ఈ మంత్రము పరిపూర్ణ సిద్ధాంతమునే ప్రబోధించుచున్నది.**

**హరిఃఓం**

తనను శరణు జొచ్చిన శిష్యునికి, గురువు శ్రీకృష్ణదేశికుల కందార్థ దర్వులలోని 23వ పద్యమును వినుపించుచున్నాడు.

క.ద. 23. **"శరణా గతుడగు శిష్యుని కరుణామృత దృష్టి చాత । గని మోదము। ముప్పిరిగొన మృదు వాక్యములను । పరమ దయాళుండు గురుడు భక్తా వినుమనెనూ। సంశయమిక బాధింపదనెను। పరిపూర్ణ మొకటి లేనెరుకానెదొకటి పరిపూర్ణ మెరుకాల నెరిగి । యెరుకనుమాను । భక్తా వినుమనెనూ "**

తా॥ శరణు జొచ్చిన శిష్యునకు సద్గురు కరుణామృత దృష్టిచే చూచి జనన మరణ రహితమునకు నీవు యిచ్చటికి రావడము సంతోషము. ముప్పిరి గొనుమృదు

వాక్యములు విన్నచో జనన మరణ రహితమునకు సంశయమనె బాధ నుండదు. అవి యేమనగా. 1. పరిపూర్ణమనున దొకటి,2. యెరుకనునదొకటి, 3. పరిపూర్ణమెరుకలనెరిగి యెరుకను విడుచునదొకటి.

**శిష్యుడు:** ముప్పిరిగొను మృదు వాక్యములనగానేమి ?

**గురువు:** పరిపూర్ణమును తెలుసుకొనునదెరికే. ఎరుకను తెలుసుకొనునదెరికే. తానులేనని తనను తాను తెలుసుకొననదెరికే. కనుక ఇవి ముప్పిరిగొను మృదువాక్యములు.

**శిష్యుడు:** స్వామీ! సంశయము బాధింప కుండు టెట్లు ?

**గురువు:** జనన మరణములేని పరబాహ్యమును, జనన మరణములు కలిగిన ఎరుకను తెలుసుకొని పరిపూర్ణమునకు యెరుకకు ఏలాంటి సంబంధము లేదని, లేనిది లేనట్లు విడిచి యుండును. కనుక జనన మరణ పద్ధతిగల యేలాంటి సంశయము బాధింపదని నిర్ణయము.

**శిష్యుడు:** నిరాలంబోపనిషత్తునగల మొదటి శ్లోకమున మొదట హరిః ఓం తో ప్రారంభమైనది. దాని అర్థమును దయచేసి విడమరచి చెప్పగలరని ప్రార్థించుచున్నాను.

**గురువు:** హరిః ఓం అను మంత్రమునందు రెండు పదములు గలవు. **1.హరిః, 2. ఓం.** హరి యనగా వెన్నుడు, భక్తుల పాపములను హరించువాడు, సూర్యుడు, చంద్రుడు, చీకటిని పోగొట్టువాడని నిఘంటువున అర్థములు గలవు. ఓం కారము ప్రణవ స్వరూపము గదా! హరిః ఓం అనగా ప్రణవ స్వరూపుడైన పరమాత్మ లేక బ్రహ్మము, భక్తుల పాపములను హరింపజేయువాడు. వారి అజ్ఞానమును తొలగించి జ్ఞానము ప్రసాదించువాడని అర్థము స్ఫురించుచున్నది. ఇదిలోక విధితము ఇతరులు చెప్పునది వాచ్యార్థము.

**శిష్యుడు:** అయితే లక్ష్యార్థము వివరించండి స్వామీ ?

**గురువు:** లక్ష్యార్థముగా వివరించిన యెడల హరియనగా పరిపూర్ణపరబయలు, ఓం కారమనగా లేనెరుకయని అర్థము సిద్ధించును. జనన మరణ రహితము గావించుటయే ఈ మంత్రము యొక్క లక్ష్యార్థము.

**శిష్యుడు:** ప్రభో ! హరిఃఓం అనే మంత్రమును పరిపూర్ణ బోధకు అన్వయము జేసి చెప్పుటకుగల కారణమేమైయుండును?

**గురువు:** హరి ఓం అనె మంత్రము నిరాలంబోపనిషత్తు మొదటి శ్లోకమునందు ప్రారంభమునగలదు. ఈ ఉపనిషత్తు శుక్ల యజుర్వేదాంతర్గతమై యున్నది. శుక్ల యజుర్వేదశాంతి పాఠముగా శ్లో॥ పూర్ణమదః పూర్ణామిదం పూర్ణామేవా వశిష్యతే॥ అని గలదు. కావున నిరాలంబోపనిషత్తు మరియు శాంతి పాఠము యొక్క అంతిమ లక్ష్యము జన్మరాహిత్య మోక్షము సిద్ధింప జేయుటయే. అంతేగాక ఈ ఉపనిషత్తు మొదటి మంత్రమున నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజతియఃసయద్య ససన్యాసీచ యోగీచ కైవల్యం పద పశ్నుతే అను పరిపూర్ణ సిద్ధాంతమునే ప్రబోధించు చున్నది. కావున జన్మ రాహిత్య రూపమోక్షము పరిపూర్ణబోధచే సిద్ధించును. గనుక ఈ మంత్రమును పరిపూర్ణ బోధామృతమును బోధించునట్టిదిగా అన్వయము జేసి జెప్పబడినది.

**శిష్యుడు:** అట్లగుచో స్వామీ! దయచేసి ఆ సిద్ధాంత భావమును తెల్పండి.

**గురుడు:** శిష్యతిలకా! శ్రద్ధగావినుము. ఎవడు ఆలంబమును వదిలిపెట్టి నిరాలంబమును ఆశ్రయించునో అతడు సన్యాసి, యోగి, అట్టియోగి కైవల్యము అనగా జన్మరాహిత్యమును పొందును అని సూటిగా పరిపూర్ణ సిద్ధాంతమును ప్రబోధించుచున్నది.

**శిష్యుడు:** మన్నాథా ! పరిపూర్ణపరబయలుకు ఏ పేరు లేదంటున్నారు గదా ! హరిః యనుట ఎట్లు సమర్థనీయమో తెల్పగలరు.

**గురుడు:** పరిపూర్ణపరబయలు యనివ్యవహారార్థముగా వాడబడు దానికి యే పేరు లేదనుట నిజమే. కాని వ్యవహారార్థము దానికి మనమే (యెరుకనే) పేరు పెట్టినట్లు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ప॥38 నందు "**పేరచల మనుచు బయలని। పేరెప్పుడు లేదు మనము బెట్టుట చాతన్। పేరాయె బయలు కిప్పుడు। పోరానీవు నేను మృషనిపోతే చాలున్॥**" అని సెలవిచ్చియున్నారు. కనుక పరిపూర్ణ పరబయలుకు వ్యవహారార్థము పరిపూర్ణమనీ, బట్ట బయలనీ, పరిపూర్ణ పరబ్రహ్మము అనీ, అచలమనీ, శివం అని నిరాలబం అనీ మరి కొన్ని పేర్లు మనము పెట్టినవే. ఇంకేపేరుతో పిలిచిన అది కూడా మనము పెట్టినదేయగును.

**శిష్యుడు:** స్వామీ! అచల ఋషులెవరైన హరి అనే పదమును పరిపూర్ణమునకు పర్యాయ పదముగా వాడినారా? తెల్పండి.

**గురుడు:** హరి యనె పదము పరిపూర్ణ పరబాహ్యమునకు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత పరమతత్వకందములైన 33,34 పద్యములందు వాడినారు. పరిశీలిద్దాము.

**క.ప॥ 33 హరియందు దోచునిశ్వము । నరస్వప్నమువంటిదనిరి నానా జనముల్ । సురస్వప్నమువంటిదియనె । స్థిరమతి శివరామ నామదీక్షితులు ధరన్ ॥**

తా॥ అచల పరిపూర్ణపరబయలు (హరి) కన్నా ఇంకొకటి గలదని విశ్వసింప బడుదానిని విశ్వమని చెప్పబడును. ఈ విశ్వము నర స్వప్నమువంటి దని మతముల వారు నిర్ణయించి చెప్పియున్నారు. దానిని శివరామదీక్షితుల వారు సురస్వప్నము వంటిదని స్థిరమతితో సిద్ధాంతము చేసియున్నారు. ఈకందమున హరియనే పదము పరిపూర్ణమునకు పర్యాయ పదముగా వాడినారు.

**శిష్యుడు:** స్వామి నరస్వప్నమునకు, సురస్వప్నమునకు గల భేదమేమి ?

**గురువు:** హరి కన్న ఇతరము ఇంకొకటి కలదని విశ్వసింపబడు దానిని విశ్వమని చెప్పబడును. ఆ విశ్వమును సృష్టిచేయువాడు బ్రహ్మ, పోషించువాడు విష్ణువు, లయము చేయువాడు రుద్రుడు. వీరు నియమిత దేవతలు వారిచే సృష్టించబడి, స్థితిలయములు చేయబడు విశ్వమా మానవుని స్వప్నావస్థతో సమానమైనదని నిర్ణయము. ఈ విధానము నమ్మదగినదిగాదు. ఎందు కనగా తన సృష్టికి కారణమైన వస్తువు తనస్వప్నమువంటి దెట్లగును? అయినను జాగ్రత్త ననుసరించి వచ్చునుగాని స్వప్నము ఇతరత్రా కలుగునది గాదు. మరియు జాగ్రదవస్థ ఎట్లు కర్మానుభవము గలదో, స్వప్నావస్థ కూడ కర్మానుభవము గలదే కనుక విశ్వము నర స్వప్నము వంటిది యని నిర్ణయించుట సరిగాదు. ఈ పద్ధతి వలన జన్మభ్రాంతి అధికమగును.

**శిష్యుడు:** సురులనగా ఎవరుస్వామీ?

**గురువు:** హరి యందు (అచల పరిపూర్ణ పరబ్రహ్మమందు) ఓంకారమునకు (ఎరుకకు) మూలము గాని స్థానము గాని లేదని సద్గురువు వలన వస్తు నిశ్చయముగా తెలుసుకొన్నవారు సురులు. గనుక ఇట్టివారికి విశ్వము స్వప్నము వంటిదని నిర్ణయము. ఈ పద్ధతి వలన జన్మ భ్రాంతి నశించి పోవును. ఇక 34వ

కంపు **సురులందు దోచుస్వప్నము ।**
**హరియందునదోచు విశ్వమాసురుల హరిన్ ।**
**యెరిగిన కలవిశ్వము ।**
**తామరుగవె తమలేమి నెరిగి యతి విడియమునన్ ॥**

ఈ పద్యమునందు హరియనె పదము రెండుసార్లు పరిపూర్ణ పరబయలుకు బదులుగా వాడబడినది.

**శిష్యుడు:** స్వామీ! ఈ హరి పాలకుడని శంఖు చక్ర గదలవంటి ఆయుధములు ధరించి యుండునని అంటున్నారు గదా! మరెట్లు స్వామీ !

**గురుడు:** అవును. మతముల వారు **"ఉపాస కానాంహితార్థాయ బ్రహ్మణో రూప కల్పనా"** అని తమ తమ సమ్మతముగా ఉపాసన సౌలభ్యము కొరకు శంఖు చక్రగదల వంటి ఆయుధములు, నాలుగు చేతులు, భార్యా బిడ్డలను కల్పించినారు. **"తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే"** - కేనోపనిషత్తు. ఏది వుపాసింపబడుచున్నదో ఆ బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మము గాదు. హరియందు ఓంకారము (ఎరుక) లేదు. హరి అహంను పుట్టించదు, గిట్టింపజేయదు. కనుక ఏ నిర్ణయము చేయదు. వరమీయదు.

**హరిః**

**శిష్యుడు :** హరిని గూర్చి వివరించండి ప్రభూ !

**గురువు:** హరిని గూర్చి వివరింతును. సావధాన చిత్తుడవై వినుము. పరిపూర్ణ సిద్ధాంతము నుద్ధరించిన శ్రీ శివరామ దీక్షితుల వారు హరిని గూర్చి క్రింది విధముగా వివరించినారు.

హరి అనగా పరిపూర్ణము " **పుట్టనిది - చావనిదీ, రాకడ పోకడ లేనిదీ. సకల దేశాలయందు, సర్వకాలలయందు, సమస్తమైన వస్తువులందు మొదలు కొనలేక, చలించక ఒక్కతీరుగా తనకు తానే స్వతసిద్ధమైయున్నది."** మరియు అచలపరిపూర్ణ మున్నదంటే కాన రానిది. ఆకాశము వంటిది? అని సెలవిచ్చి యున్నారు.

సృష్టికర్తగాని, సృష్టిలోని మరేదిగాని లేనిదే హరి. సృష్టి కారణమగు బ్రహ్మ స్వరూపమే అందరి యొక్క స్వరూపము నిజస్వరూపము. కాని చెప్పే తాను గూడా లేనప్పుడు హరి యనే పేరు ఆ కేవల బ్రహ్మకు నిరాలంబమునకు సార్థకమగును, హరి అనగా బయలు. బయలుకు బట్ట బయలుకు కూడా బయలైయున్నది. కనుక నిజముగా యోచించినచో హరియని నిరాలంబనమనీ పలుకుటకు అపుడెవరుందురు? వాక్కుతో

పలుకరానిది యిది యొక్కటిమాత్రమే. కనుక " **నతత్రచక్షుచ్ఛతి నవాగచ్ఛతి నో మనః**" అని కేనోపనిషత్తు శ్రుతి కేవలం హరికి మాత్రమే వర్తించగలదు. హరి నిరపేక్షకమైనది అంటే సర్వలక్షణవిలక్షణము దాని లక్షణము అని అనాలి. హరి అంటే శూన్యం గాదు. శూన్యంను గుర్తించుటకు గుర్తెంచెవాడు వాని గుర్తు కూడ లేని స్థితి అది. కనుక హరి శూన్యం కాదు. ఏమందామన్నా అనె వ్యక్తి, అతని వాక్కు రెండు లేని స్థితి అది. కనుకనే ఏమన రానదని వూరకున్నారు. చివరకు "**అస్తీత్యేవోపలబ్ధవ్య**" అని దానిని అస్తి పదార్థమనిన, అస్తి పదార్థము నాస్తి అనె పదాన్ని అపేక్షిస్తుంది. కనుక అస్తినాస్తులు గానిది. అయిన "**అస్తీతి బ్రువతో2న్యత్ర కథం తదుపలభ్యతే**" - కఠోపనిషత్తు. అనగా ఉన్నది అని చెప్పుట కంటే మరొకవిధంగా చెప్పుటకు వీలుగాదు. కనుక గత్యంతరము లేక అస్తి అని వాడినారు. మరియు పంచ తన్మాత్ర రహితమైనది. స్థూలసూక్ష్మములు గానిది. ఎరుక మరుపులు లేనిది. వస్తు రూపకముగా తోచబడెవాని అన్ని బాహ్యాభ్యంతరములందు హరి యే నిండియున్నది. జ్ఞానా జ్ఞానములుగానిది. బంధమోక్షములు లేనిది. ధ్యానింప తగినదికాదు. జిజ్ఞాసిత్వయం గాదు. ఇంకా కేనోపనిషత్తు " **యస్యామతం తస్యమతం । మతం యస్య నవేదసః । అవిజ్ఞాతం విజాన తాం । విజ్ఞాత మవిజానతాం**"॥

తా॥ ఎవడు తెలియదనెనో వానికి తెలియును. తెలుసునన్నవాడే నిజముగా తెలియనివాడు. దానిని యే సాధన చేతను తెలసికొన రానిదని తెలిసినవాడే దానిని ఎరిగినవాడు. **2) " యది మన్యసే సువేదేతి దభ్రమే వాపి నూనం త్వంవేత్థ బహ్మోణోరూపమ్" ।కే.న.ఉ.**

తా॥ నేనీ హరిని (నిరాలంబం) ను చక్కగా తెలుసుకొంటిని అని నీవందువేని నీవు తెలుసుకొన్నది నిశ్చయముగా అల్పమైనదే. **3) "అన్యదేవ తద్విదితా దథో అవితాదధి"**

తా॥ తెలుసుకొన్నదాని కంటెను, తెలియనిదాని కంటే అది పరముగానున్నది.

అది యిట్టిది అట్టిది ఎట్టిదో చెప్పలేము. మనసుచే నూహింపలేము. ఇత్యాది వాక్యములచే అది లక్షింపబడ జాలదు. కనుక అట్టి నిరపేక్షక కేవలత్వము ఎందుగలదు అని మాత్రము శ్రుతి యుక్తి అనుభవములకు గోచరమగుచున్నది.

అచల ఋషుల సిద్ధాంతము ప్రకారము సృష్టికి మూల కారణమగు (జగదధిష్ఠానము) కూడా సాపేక్షికమే. "**అహం బ్రహ్మాస్మి**" అను మహావాక్యమున ఏ అహం అనగా ఏ నేను ఉపలక్షింపబడినదో ఆ నేను నేనై యుండి కూడా ఆ హరిని కేవలత్వమును గుర్తించలేను. ఆ నేను (ఎరుక, ఓం) లేనిచో అది (హరి) వున్నదని చెప్పువారు లేరు గదా! నేనువుంటే అది కేవలత్వంగాదు. కనుక నేను "**అహం**" అను పదార్థము సమూలంగా అత్యంత రహిత స్థితిని పొందుటయే అట్టి కేవలత్వసిద్ధి. అట్టి స్థితి కలిగిననే జన్మరాహిత్యము. అంత వరకు ఈ సాపేక్షక చక్ర భ్రమణములో సంచర ప్రతిసంచర పద్ధతిగా అధోర్ధ్వ పరిణామములు చెందుచు జనన మరణ ప్రవాహములో మృత్యోసమృత్యుమాప్నోతి" అన్నట్లుగా చచ్చుచూ పుట్టుచు, పుట్టి చచ్చుచు, చచ్చి-పుట్టుచూ పోవలసిందే. ఇదే అచల ఋషుల దివ్య సందేశము.

ఓం.

**శిష్యుడు:** ప్రభో ! హరిని గూర్చి బహుచక్కగా జెప్పితిరి. ఇక ఓం కారమును (ఎరుకను) గూర్చి సెలవియ్యండి:

**గురువు:** ఓం కారమనగా ప్రణవము, స్వరము, అకారాది అచ్చులు, పరబ్రహ్మస్వరూపము. హరి నెరుగుట సాధ్యపడదుగాని ఓం కారము యొక్క స్థాన స్వరూప స్వభావములు తెలుసుకొన్నవాడే దానిని యెరిగిన వారలమగుదుము. ఓం కారమును గూర్చి శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద 122 యందు " **పంచాశద క్షరముల ప్రపంచము తానుద్భవించె। ప్రణవాక్షర మందంచు శ్రుతులెన్నె । దాన్నెరు కంచని నీవెరిగి। యెరుగు మచలాముదీనన్। నిల్పకు మెరుకొ నచలాములోనన్। చంచలామతి చాత । చతురాక్ష రెక్కూవం చెంచేద వెందుకు । యిది నమ్మ కెరుగుమీ। యచలాముదీనన్॥"** అని సెలవిచ్చియున్నారు.

తా॥ ఏబది యక్షరములచేత శబ్ద విస్తీర్ణమైన ప్రపంచము పుట్టినది. ఇందుకు కారణము ప్రణావాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. ఆ ప్రణవమే ఎరుక యని తెలుసుకొనుము. ఆ పరబయలునందు ఓంకారమును నిల్పకుము అని ప్రభోదించియున్నారు. ఓం కారమనగా యెరుకయని స్పష్టపరిచినారు.

**శిష్యుడు:** ఓ సద్గురుమూర్తీ । ఓం కారము ఏకాక్షరమా? లేక అక్షర సమూహమా? సెలవియ్యండి స్వామి.

**గురువు:** "**ఓ మిత్యేకాక్షరంబ్రహ్మ**" అని భగవానుడు భగవద్గీత యందు ప్రబోధించియున్నారు. నారద మహర్షి దీనిని అమాతృకగా నుడవగా శ్రీ వశిష్ఠులవారు దీనిని త్రి మాతృకగా వివరించిరి. కాని యాజ్ఞవ ల్క్యులవారు దీనిని చతురాక్షరిగానే వర్ణించిరి. శ్రీ భాగవతుల కృష్ణదేశికులవారు దీనిని చతురాక్షరి గానే స్వీకరించి తన ప్రణవార్థ ప్రకాశికయందు బలపరిచిరి. కావున అకార, ఉకార, మకార అర్థమాతృక స్వరూపమైన ఈ ప్రణము వలన ప్రపంచమాయెను. అదెట్లనగా ?

**అ**కారము లయము పొందగ భూమి, అగ్ని, ఋగ్వేదము భూలోకము బ్రహ్మలోకము అవిర్భవించెను.

**ఉ**కారము లయము పొంగా అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము సనాతనమైన విష్ణువు ప్రభవించెను.

**మ** కారము వలన ద్యులోకము, సూర్యుడు, సామవేదము స్వర్లోకము మహేశ్వరుడు ఉద్భవించిరని శాస్త్రములు ఘోషించు చున్నవి.

"శ్రుతి॥ **ప్రణవోయీ పరంబ్రహ్మ ప్రణవశ్చ పరస్స్మృతాః**" అనగా ప్రణవము నిశ్చయముగా పరబ్రహ్మస్వరూపమే. దీనినే అచల ఋషులు అచ్చ తెనుగున ఎరుకన్నారు.

**శిష్యుడు,** ఓం కారమును అచల ఋషులు మరియు కృష్ణదేశిక ప్రభువులు లెనెరుక యని అన్నారు. లేనెరుకను గురించి దయచేసి వివరంగా తెల్పండి.

**గురువు:** "**ఎరుక (ఓం కారము) మెరుపువలె నున్నావనిపించి వెంటనే యేమి లేక పోయ్యేది. కలవంటిది**" అని శ్రీశివరామ దీక్షితుల వారు పేర్కొన్నారు. ఎరుకే పిండ బ్రహ్మాండములు, జీనేశ్వరులు, దేహీదేహములు, జ్ఞానేంద్రియములు ఇదే, వీటిలో కన్ను

ముఖ్యమైనది. ఇది ఎరుకకు స్థానమని అందురు. ఎరుకే ఖండా ఖండములుగా, అఖండముగా కూడా నున్నది. ఆత్మానాత్మలు, సదసత్తులు, శివ శక్తులు, పంచభూతాకారమైన జడా జడాత్మకమైన ప్రపంచము, నాద బిందు కళలు, దేహేంద్రియములు ప్రకృతి పురుషుడు, రాకడ పోకడ, నేను మేను అనేది ఇదే. దేవుడన నేనే అనేది ఇదే. వేదశాస్త్రములు పురాణములని వ్రాసుకొన్నది ఇదే. ఇదే ఓం కారము ఎరుక.

జ్ఞానా జ్ఞానములు యెరుకే స్థూలముగా విశ్వమందు నేత్ర గోచరమగు ప్రతిది ఎరుకస్వరూపము. సూక్ష్మముగా మనోగోచరమగు ఆత్మ సచ్చిదానంద స్వరూపమే. ఎరుక మరుపులు ఎరుక స్వరూపమే. అనేకం ఏకం ఇదే. ఇదే సాక్షి. ఒకటి అయివుండి తనలోతానే అనేకంగా భ్రమిస్తుంది ఇదే. అభిమానము చీకటి వెలుగు నిర్ణయము చేసేది ఇదే. క్షేత్ర క్షేతజ్ఞులు ఎరుకనే అదే ఎరుక స్వరూపమే.

క్షణమైన వూరకవుండక ఎరుక యేదో ఒక వ్యవహారము చేస్తుంది. మార్పు, విక్షేపము, చాంచల్యము, సంకల్ప వికల్పములు చేయుట దీని స్వభావము. అనేకం ఏకం ఇదే. యెరిగేది యిదే. వచ్చెటప్పుడు నీవు యెక్కడి నుండి వచ్చినావు, పోయెటప్పుడు యెక్కడికి పోతావు అనె యెరిగే దిక్కులేనిది. దీని రాకడ పోకడనే ప్రపంచోత్పత్తి, స్థితిలయములు. దీనికి మూలములేదు. అన్నిటికి మూలము యిదే. సర్వ క్రియలకు ఇదే కర్త. ఇదే ఓం కారము. ఇదే విక్షేపావరణములు. ఇదే బీజవృక్షములు. ఒక్కమాటలో చెప్పాలంటే హరి తప్ప మిగతాదంతా ఎరుకనే.

ఇక ఎరుకను లెనెరుకని యెందుకన్నారంటే అద్వైతులు బ్రహ్మము, మాయా వేర్వేరు అంటూనే మాయా, బ్రహ్మము యొక్క శక్తి అంటారు. ఈ విషయమును పరిశీలించిన మాయా బ్రహ్మములు రెండు ఒకే నాణెపు బొమ్మబొరుసు లాంటివి. బ్రహ్మమే మాయ, మాయయే బ్రహ్మము.వస్తు నిశ్చయము గలవారికీ విషయము అనుభవగమ్యమే. అంటే ఇతరులు చెప్పే బ్రహ్మము ద్వంద్వ రూపముగా నున్నది. ఈ మాయాబ్రహ్మల సమిష్టి రూపమైన ఏకైక వస్తువునకే లేనెరుకయని నామకరణము జేసి యున్నారు. ఎందుకనగా ఈ **బ్రహ్మమునకు హరిః యందు మూలముగాని నిలిచే అందుకు స్థానముగాని లేనందున దానిని లేనెరుకయని వ్యవహరించుచున్నారు.** కావున ఓం కారమును లేని ఓంకార మనవలయును. **క.ద.॥85 లేనెరుకను యెరుకనియన । లేనెరుకేట్లాయెననిన లెస్సగా వినుమా లేని మృగజలము । వంధ్యాసూనులు గలిగుండి వెదకిచూడా లేనట్లు ఈ లేనెరుక యాడాలేదిట్లు.** అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. మృగజలము వలె, వంధ్యా సూనుని వలె వెదికి చూడ లేనట్లు అచల సిద్ధాంతము ప్రకారము ఓం కారము (ఎరుక) హరియందు వెదికిన లేకుండును. కనుక దానిని లేని ఓం కారమని లేనెరుక యని అనిరి.

**శిష్యుడు:** శ్రుతి రూపమైన ఓం కారమును నాగర లిపిలో పూర్వము ఎట్లు వ్రాసేవారో సెలవియ్యండీ తండ్రీ.

**గురువు:** ఓం కారమును నాగర లిపిలో అనగా సంస్కృతలిపిలో ***ओम*** అని వ్రాయుట జరిగినది. అదే విధంగా తెలుగులో ఓమ్ అని వ్రాయుట జరిగినది. కాల క్రమమున మార్పు వచ్చుటచేత ॐ గా వ్రాయుట మొదలిడిరి. అదే విధముగా

తెనుగులోకూడా మార్పువచ్చి ఓ కు వలపల సున్ననిడి **ఓం** అని వ్రాయుట మొదలు పెట్టిరి. ఈ ఓం కారమే సృష్టికి కారణమని తెలుసుకొన్నాము. ఇట్టి ఓం కారము మీరు ఆశ్రయించితే తిరిగి జన్మవచ్చును.

**శిష్యుడు:** ఓ సద్గురు దేవా। సృష్టికారణ వస్తువును ఆశ్రయించితే జన్మ. తద్రహిత మందే జన్మరాహిత్యసిద్ధి నెట్లు సిద్ధించునో వివరించండి।

**గురువు:** శ్రీ ఫీల్కాన లక్ష్మణ రావు గారి శిష్యులు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత గారు " **ఆకాశస్య గుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మోవుచ్యతే**" అని శ్రుతి వాక్యమును దృష్టియందుచుకొని తన సద్గురు భక్తా శతకమున **ఓ కువలుపల బిందువుంచితే ఓమ్ అని శబ్దించును దాపల బిందువునుంచితే యేమనదు భక్తులారా! పరిపూర్ణ బోధచే మేల్కొన్న ఎరుక ఎన్నడుండదు గురు కటాక్షముచేత తొలుగును గుర్తెవుడు భక్తులారా ॥** అని గానము చేసినారు. దీనికి చిహ్నంగా **ఒఓం** అని రూపొందించి దానిని పరిపూర్ణ సిద్ధాంత మునకు ప్రతీకగాచాటిరి. అట్లే శ్రీ భూమానంద హనుమద్దేశికేంద్రులు వారు:

" **శంకలుదీరెను వినుమిది । అంకెలలో ఒంటు నొకటి ఆత్మనబడునూ । వంకులబొంకుల జగమిది । వంకలులేనట్టి యచలం వాసిగా గనుడీ । పై సున్నిడి వైకుంఠమనుడీ ॥**"

ఇందలి భావము ఆత్మాతీతం కేవాలాత్మ అనె శ్రుతిని బలపరుచుచున్నది. దీనినే గుర్తుగా ౧౦ అనె చిహ్నముతో వ్యక్త పరచబడినది. అదెట్లనగా ఒకటి (1) అనునది ఆత్మ. దాపల సున్న ఆకాశము. దీని వలన తత్వ స్వరూపమైన ప్రపంచ మేర్పడును. ఇది లెక్క పెరిగే పద్ధతి. వలపల సున్న హరికి ప్రతీక **"ఆత్మాతీతం । కేవలాత్మదేహోనాస్తి కదాచన"** అనునట్లు మూలము లేని ఈగుర్తెరిగే శరీరము యేమి లేదను భావము స్థిరపరుచుచున్నది. అందువలన సృష్టికి అధారము ఓం కారమే అనియు, అదే అధిష్ఠాన చైత్యమనియు, సకల జీవోపాధులకు మూలమనియు తేలినది. కాని దానికి మాత్రము మూలము లేదని ఈ గుర్తెరిగే శరీరము యేమిలేదని అచల ఋషులు నిర్ణయించిరి. ఇదేమాటను తేజోబిందో పనిషత్తు

**శ్లో॥ ఆత్మేతి శబ్దహీనోయం । ఆత్మశబార్థ వర్జితః॥**
**సచ్చిదానంద హీనోయం । ఏషైవాత్మా సనాతనః ॥**

తా॥ ఆత్మయనుశబ్దములేనివాడు ఆత్మశబ్దార్థ వర్జితుడు ఈ ఆత్మ సచ్చిదానంద హీనుడు నిర్దేశింప శక్యము గానివాడు.

**శ్లో॥ ప్రణవార్థ విహీనాత్మా లక్ష్యవాచ్య వివర్జితః**
**శుద్ధచైతన్య హీనాత్మా సర్వభాస వివర్జితః ॥** సర్వసార పూర్ణోపనిషత్తు

ఈ భావము "బ్రహ్మైవాహ మస్మి అహం పదార్థ రహితం" అను శ్రుతి నొక్కి చెప్పుచున్నది. కావున సృష్టి కారణమైన ఓంకారమును ఆశ్రయించితే జన్మవచ్చును. కాని దాని రహితమందే జన్మరాహిత్యమోక్షము సిద్ధించుననితెల్పుటకు **ఒఓం** అను చిహ్నము ద్వారా అచల ఋషులు పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమును చాటిచెప్పిరి. కనుక హరిని మరియు ఓంకారము క్షుణ్ణంగా గురుముఖంగా తెలుసుకొనవలయును.

## ఓం కారమును (ఎరుకను) వదులుట

**శిష్యుడు:** ఓ తండ్రీ ! యింతవరకు హరిని గూర్చి మరియు ఓం కారమును గూర్చి జెప్పినదంతాబాగుగా అర్థమైంది. "హరిఃఓం" యను మంత్రమునందు రెండే ప్రసాదములుగలవు. మూడవ ప్రసాదమైన ఎరుకను విడుచుటయనే ప్రసాదము లేదు గదాయనె సంశయముకలుగుచున్నది. దయచేసి యిట్టి సంశయమును నివారించవలసిందిగావేడు కొంటున్నాను.

**గురువు:** ఓ కుమారా! హరిః ఓం యను మంత్రమున హరియంటే పరిపూర్ణ పరబ్రహ్మయని, ఓంకారమనగా లేని యెరుకని తెలుసుకొంటిమి. వివేచన చేయగా హరి శాశ్వతమైనది. ఓం కారము అశాశ్వతమైనది, మిథ్య, మాయ లేనే లేదని స్పష్టము. కనుక సత్యమైన నిత్యమైన హరినే ఎన్నుకొందురు. కాని మిథ్య, అసత్యమైన ఓంకారమును నిలుపుకొనుట సత్యవంతులు ఇష్టపడరు. ఎట్లుగా ఎండమావులందు నీరులేనేలేదని తెలిసినవారు, ఎండమావులు కనబడిన అందు నీరు లేనే లేదని పరిగెత్తడు. అట్లే సత్యమగు బట్టబయలు నసత్యంబగు యెరుక నెరిగి సద్గురకృపచే ఎరుకను సత్యము గాదని సత్యముగా నమ్మినవాడు ఓం కారము నందలి భ్రాంతిని వదులుటకు ఇష్టపడునుగాని ఓం కారమును అంటిపెట్టుకొని యుండడు. ఇందుకు క.ద. 115 **తిమిరారియందులేనిదె। తిమిరము తను దానెవచ్చి తేజోనిధియా। తిమిరారియునికి గనుగొని తిమిరము తానిల్వనట్లు తెలుసుకొనరాదా। బయలెరుకాల తెలసి యామీదా । భ్రమరూపమైనట్టి బ్రహాండ మెరుకాల భ్రమదీసివేసితె। భ్రాంతిపుట్టదు మళ్ళీ తెలుకోరాదా।** అనీ శ్రీకృష్ణదేశికులవారు సెలవిచ్చి యున్నారు.

తా॥ సూర్యునియందు లేనిచీకటి తనకు తానే వచ్చి సూర్యునియునికిని తెలుసుకొని తనంతట తానే లేక పోవుచున్నది. అట్లే హరిని ఓం కారమును గురుముఖత తెలుసుకొన్నచో భ్రమరూపమైన బ్రహ్మాండము ఎరుక రూపమైన ఓం కారము తన వునికి హరియందు లేదని తెలుసుకొని తానే లేకుండాపోవును.

ఈ విధముగా విచారించిన యెడల తేలినదేమనగా త్రివిధ ప్రసాదములలో ఎరుకను విడిచే విధానము, హరిని మరియు ఓం కారమును తెలుసుకొనుట యందే బీజ రూపమున గర్భీకృతమై యున్నదని తెలియవలయును.

**శిష్యుడు:** ఓ గురురాయా ! ఓం కారమును (ఎరుకను) వదులు టెట్లో దయచేసి వివరించగలరని ప్రార్థించుచున్నాను.

**గురువు:** పరిపూర్ణబోధను ఒక్కవాక్యములో చెప్పవలయునన్న, హరిని మరియు ఓం కారమును యెరిగి, అశాశ్వతమైన ఓం కారమును వదులుట. ఓం కారము యొక్క స్థాన, స్వరూప, స్వభావముల నెరిగి తాను ఓం కార స్వరూపుడనై నిలువవలెను. అంటే తాను బ్రహ్మస్వరూపుడనని గుర్తెరిగి తానే బ్రహ్మననే భావనలో వుండాలి. అపుడు తన కన్యంగా నున్న హరియందు తనకు మూలము లేదని నిలిచేయందుకు స్థానములేనే లేదని గురువు ద్వారా ఆరూఢత జెందినవారే ఎరుకను విడిచిన వారగుదురు.

**శిష్యుడు:** ఓంకార స్వరూపుడై నిలుచుట యనగా నేమోసెలవియ్యండీ తండ్రీ!

**గురువు:** ఓంకార స్వరూపుడైనిలుచుట అనగా అద్వైత సిద్ధినొందుట, దేనినైనా పూర్తిగా నెరుగవలయునన్న తన మనస్సు అవస్తురూపమును దాల్చిననే గాని ఆ వస్తువు అపరోక్షమైనదని అనాలి - వ్యష్టి రూపమైన ఎరుక సమిష్టిరూపమైన జ్ఞేయం రెండూ ఏకరూపత్వం వహిస్తేనే అపుడు ఓంకార స్వరూపుడై నిలిచినాడని అనాలి. ఇదే అఖండజ్ఞాన స్వరూపములేక స్వస్వరూపము.

**"మనోహిజత్ వత్"** అనగా లక్కను కరిగి యేమూసలో పోస్తే ఆ యాకారము ధరించునట్లు, ధ్యానము నందు ఏకాగ్రత ధరించిన మనస్సు నిర్విషయమై తన్మయత్వము చెందిన మనస్సు బ్రహ్మాకారము నేదాల్చును. **ఇదే ఆత్మ సాక్షాత్కారము,** నీ నిజస్వరూప దర్శనము. అపుడు నీవు నీ నిజ స్వరూపము నెరిగిన వాడవైతివి. అపుడు ఇంకా తెలివిచే తెలియదగినది యేదిలేదు. అపుడు సర్వముతానే అయి నిలిచినవాడవు. అవును తాను, తన కన్యంగా హరి మాత్రమే వుంటాయి. హరి యందు తనకు మూలములేదనె విషయము నిచ్చటనే ఆరూఢమగును. అపుడు గురుడు ఎరుకను నిల్వకుమని చెప్పిన మాటలు పాటించి పాలించుటయే. అనగా వ్యష్టి రూపమైన తన జ్ఞానము, సమిష్టి రూపముగానున్న జ్ఞేయము కంటే అన్యంగానున్న హరి యందు మూలంగాని, స్థానముగాని లేదని తెలుసుకొని తానుబ్రహ్మననే భ్రాంతిని పూర్తిగా వదిలివేయుటయే ఓంకారమును వదులుట. అట్టి ఓంకారమునగల భ్రాంతిని వదులుటయే భ్రాంతిరహితము. ఇదేజన్మరాహిత్య మోక్షము. ఇదే మానవుడై పుట్టునందులకు చేయవలసిన మొదటిపని.

**శ్లో॥ అశరీరం సర్వదాస్తి శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి రన్యదాభ్రమకారణం॥**

తా॥ శరీరములేని హరి (పరిపూర్ణము) ఎల్లప్పుడు వున్నది. శరీరము ఎప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తిలభించును. ఇతర సిద్ధాంతముల వల్ల భ్రాంతి అధికమగును.

**శిష్యుడు:** గురుదేవా ! జన్మరహిత మెట్లగునో ఇంకా వివరించండి.

**గురువు:** ఇందుకుగాను వేమన యోగి పద్యమును పరిశీలింతము.

**పుట్టువారలెవరు పుట్టనివారెవరు ?**
**పుట్టి పుట్టనట్టి పురుషులెవరు ?**
**పుట్టి పుట్టనట్లు బోధించిచూడారా ?**
**విశ్వదాభిరామ వినురవేమ ॥**

తా॥ ఆగామి, సంచిత, ప్రారబ్ధములనే కర్మత్రయమును నాశనము జేసుకొనని వారు తిరిగిపుట్టెదరు. కర్మత్రయమును నాశనము చేసుకొన్న వారు తిరిగి పుట్టరు. ఇపుడు పుట్టియుండి పరిపూర్ణ బోధ యందు ఆరూఢత చెందిన వారు పుట్టి పుట్టనట్టిపురుషులు. కావున పుట్టి పరిపూర్ణ బోధ సద్గురువు ద్వారాపొంది కర్తృత్వ రహితకర్మాచరణముగా కర్మలొనర్చి ఆగామి నశింపజేసుకొన వలయునని అట్టి బోధను బోధించుమని యోగి వేమన ఉద్బోధించుచున్నారు.

1. గురుపాదము బట్టి సర్వకర్తయగు అఖండ ఎరుక స్వరూపుడు తానేనని యెరుగుటవల్ల మోహాము నశించి సంచితరాసి అంతయుదగ్ధమగను.

2. "ప్రారబ్ధము భోగతో నశ్యేత్" అనట్లు పారబ్ధము అనుభవించుట వల్ల నశించును.

3. కర్తృత్వ రహిత కర్మాచరణముగా నేను చేస్తలేను, అంతా ఆగురు దేవుడే చేయిస్తున్నాడు అని యావద్కార్యములు చేస్తే ఆగామినశించును.

ఈవిధంగా త్రివిధకర్మలు నశించాలంటే పరిపూర్ణ బోధను పొంది జన్మరాహిత్యరూప మోక్షమును బడయుమని ఉద్బోధించుచున్నారు. **వేమనయోగి** " గురోన్ముఖేన జ్ఞాతవ్యం నాన్యధాగ్రంధ కోటి భిః అనునట్లు ఈ విషయమునంతా **1గురుభక్తి-త్రికరణ శుద్ధిప్రవర్తన, 2 గురుసేవ - గురుశుస్రూష. 3 గురునిష్ఠ - కర్తృత్వరహిత కర్మాచరణగా లొనర్చి** పరిపూర్ణ గురువును సేవించి తెలుసుకొనవలయును.

**శిష్యుడు:** స్వామి! చివరగా ఓం కారము రహితమా? ఓం కారమందలి భ్రాంతి హరితమూ ? సెలవియ్యండి ।

**గురుడు:** ఓంకార రహితమెప్పుడును గాదు. ఓం కార రహితమని పెద్దలు వాడినా ఓంకార మందలి భ్రాంతి రహితమేనని గ్రహించవలయును. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు పరిపూర్ణ మనునదొకటి, ఎరుకనునదొకటి అని చెప్పినారంటే ఓంకారముకూడ కలదని చెప్పినట్లే. లేని ఓంకార అసలే లేనేలేదని అర్థముకాదు. అది కుందేటి కొమ్మువలె అలీకపదార్ధము గాదు. అసలె లేదని గాదు. సిద్ధాంతరీత్యా ఓం కారము హరియందు లేక పోయిన అది సత్యముగా తోచుచున్నది. దానికి వ్యవహారిక సత్యమున్నది కాని పారమార్థిక సత్యం లేదు. శాస్త్రరీత్యా రెండు సత్యములుండుటకు వీలు లేదు. రెండున్నాయంటే ఏకమేవా ఉ ద్వితీయం బ్రహ్మ అనే శ్రుతికి భంగమగును. కనుక ఓంకారమును, లేని ఓం కారమన్నారు. కావున యెరుక యందు యెరక సత్యమే Men and Matter are both indestructiable అనగా పదార్థమునకు గాని తెలివికి గాని అత్యంత నాశనములేదు. పదార్థముల యొక్క నామ రూపములు ఎరుక స్థితి గతులు మార్పు చెందుట మాత్రమే. **అవి లేవు. ఉన్నవీ అనే భ్రాంతి యొక్కటే పరిపూర్ణునికి లేకుండా పోతుంది.** హరి మరియు ఓంకారములు సర్వసత్తాకములుగావు. ఎండమావుల దృష్టాంతమును విమర్శిస్తే విషయముస్పష్టమగును.

సూర్యప్రకాశము (ఎండ) నందు ఎండమావులు తోచును. కాని సూర్యుని యందు యెండమావులులేవు. నీరు అనే భ్రాంతిలేదు. అయిన ఈ ఎండమావులను చూచినపుడు నీరున్నదనే భ్రాంతి మాత్రము కలుగుచున్నది. అందు నీరులేనే లేదని దృఢపరుచుకొన్నవానికి ఇతరులకు కూడా నీరు తోస్తునేయుండును. అవి ఎండమావులు, నీరు కాదని తెలసినవాడు ఇతరులవలె ఆ దృశ్యమువలన భ్రాంతి చెందదు. తాను సత్యవస్తునసే భ్రాంతి రహితమునకే పరిపూర్ణబోధ మరియు పరిపూర్ణ గురువు అవసరము, ఎరుక అసలే లేకపోతే పరిపూర్ణ బోధ అవసరము లేదు. కనుక **పరిపూర్ణములో**

**(నిరాలంబంలో) తా నున్నాననుకోవడమే భ్రాంతి.** అందు నేను లేను అని దృఢత్వముచెంది అనగా గట్టిగ నమ్మిన భ్రాంతి రహితము. పరిపూర్ణావలోకనమే జన్మరాహిత్య మోక్షము. గురుముఖతా ఇదంతా తెలుసుకొని జన్మరాహిత్య మోక్షము బడయుదురు గాక !

సర్వం శ్రీ గురు చరణారవిందార్పణమస్తు.

**ఓన్నమశ్శివాయ**

భ్రాంతి రహితమే మోక్షము.
అంతాశివమే యుండగా నేనెక్కడ.
నేను లేనప్పుడే శివము.

సప్తకోటి మహామంత్రములలో పరిపూర్ణ బోధను ప్రబోధించి, జన్మరాహిత్యరూపమోక్షము సిద్ధింపజేయు ఏకైక మంత్రము ఓం నమఃశివాయ. ఇందు ముప్పిరి గొను మృదు వాక్యములు, త్రివిధ ప్రసాదములు Three-in-one ఒకే మంత్రమునందు నిక్షిప్తమైయున్నవి.

ఒక్క ముక్కలో పరిపూర్ణ సిద్ధాంతమును చెప్పవలెనంటే శివమును (పరిపూర్ణమును) ఓంకారమును (లేనెరుకను) యెరిగి యెరుకను మానుము (నమః అనగా యెరుకలేక సేవించుము)

ఈ ఒక్కవాక్యములో 1 శివమును 2 ఓం కారమును గురుముఖంగా విచారించి తెలుసుకోవడం తాత్విక పరిశోధనకు సంబంధించినది. తదుపరి ఆరెండింటిని యే యెరుకచేత ఓంకారముచేత గ్రహించితివో ఆ ఓం కారమును వదిలి వేయమని కర్తవ్యోపదేశం జేయబడుతుంది.

పరిపూర్ణపరబయలుకు యేపేరులేదు. ఈ విషయము క.ప. 38 ద్వారా **"పేరచలమనుచు బయలని। పేరెప్పుడు లేదు మనము బెట్టుట చాతన్ । పేరాయె బయలు కిప్పుడు పోరా నీవు నేను మృషనిపోతే జాలున్"** అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు స్పష్టపరిచినారు. శివము పరిపూర్ణమునకు, ఓం కారము యెరుకకు పర్యాయ పదములుగా ఇచటవాడబడినదని తెలియపరుచబడుచున్నది.

శివమనగా సర్వశుభప్రదమైనది, మంగళకరమైనదని అర్థము. శివము అపరోక్షమైన యెడల జనన మరణ రహిత రూపమోక్షము సిద్ధించుటకన్న మంగళ కరమైనది మరోకటి ఉండదు గదా!! కనుక ఉపనిషత్తులు అచలఋషులు అప్పుడప్పుడు శివమనె పదమను పరబాహ్యమునకు వాడినారు. దీని మూలబీజాలు వేదాంతములనబడే ఉపనిషత్తులందున్నవి. దానికేపేరు లేదు, పనికి రాదు. మనము వ్యవహారార్థము అచలమని, శివమని, పరబయలని, బట్టబయలని నిరాలంబమని పేర్లుపెట్టుటచేత పేర్లెపడినవి. అవి మంగళ కరమైనవి, శుభప్రదమైనవి.

శ్రీకృష్ణదేశికేంద్రులవారు 23క. శరణా గతుడగు శిష్యుని కరుణామృత దృష్టి చాత । గని మోదము। ముప్పిరిగొనుమృదు వాక్యములను। పరమదయాళుండు గురుడు భక్తావినుమనెనూ। సంశయమింక బాధింపదనెనూ। పరిపూర్ణమొకటి లేనెరుకానెదొకటి।

పరిపూర్ణమెరుకాల నెరిగి యెరుకనుమాను" మని సెలవిచ్చియున్నారు. ఇందులకు అచల ఋషులు, ఉపనిషద్ప్ర మాణములను పొందు పరిచినారు. కావున ముప్పిరిగొను మృదువాక్యములు కేవలమొక్క 'ఓం నమఃశ్శివాయ' యను మంత్రమున యెట్లు నిక్షిప్తమైయున్నవో పరిశీలింతము. ముప్పిరిగొను మృదువాక్యములనగా। శివమును తెలుసుకొనునది ఓంకార (ఎరుకనే) మే, 2. ఓం కారమును తెలుసుకొనునది ఓం కారమే. 3. నమః అని తనను తాను విడుచుకొనునది ఓంకారమే. ఈ మూడు పద్ధతులు ఓం కారానివే. కనుక ముప్పిరిగొను మృదువాక్యములని నిర్ణయము. పరిపూర్ణబోధను ద్వాదశి, షోడశియును మహామంత్రములను పంచదశీయను దృష్ట ద్రాష్టాంతములచే ప్రబోధింతురు. వీటిభావము ఓంనమఃశివాయయను మంత్రము నందు నిక్షిప్తమై యుండుటచే పరిపూర్ణబోధను ఈ మంత్రముద్వారా ఎట్లు వస్తు నిశ్చయముగా జెప్పవచ్చునో పరిశీలింతము.

లక్ష్యార్థముగా "ఓం నమఃశివాయ" యనుమంత్రము ద్వారా పరిపూర్ణబోధ నిశ్చయము.

1. ఉన్నది, శివము, శాశ్వతమైనది.

2. లేని ఓంకారము లేనే లేదు, అశాశ్వతము,

3. నమః అనగా నేను లేననుటయే శివునకు నమస్కారము. నమస్కారమనగా ఎరుక లేక (ఓంకారము లేక) సేవించుట. ఎరుకను వదులుట.

"ఉన్నది గురుదన్నది నేకన్నదంతట వున్నది. ఉన్నదేమో ఉన్నది నేనన్నదే లేకున్నది" శ్రీమందిప్పలహనుమంతరాజయోగి. ఉన్నది శాశ్వతమైనది శివము. అశాశ్వతమైన ఓంకారమునకు శివమునందు మూలములేదు స్థానము కూడా లేదు. కనుక ఓంకారము లేని ఓంకారము అని వ్యవహరింపబడుతున్నది.

పైన పేర్కొన్న నిశ్చయ జ్ఞానమును గురుముఖంగా నెరిగి కర్తృత్వరహిత కర్మాచరణపద్ధతిగా అనగా నమః పూర్వకముగా తన్ను తాను విడిచి శేష జీవితము గడిపిన యెడల తాను (ఓంకారము) శివమునందు ఉన్నాననే భ్రాంతి రహితమై వేయించిన విత్తనము మెలకెత్తనట్లు తిరగి జన్మరాదు. ఇదే జన్మరాహిత్య రూప మోక్షము. అప్పుడు ఏలాంటి సంశయములు బాధించవు.

## వివరములు

## 1. ఉన్నది శివము శాశ్వతమైనది

మొదట శివమే అచలమని, సనాతమనమని ఘోషిస్తున్న అన్నోపనిషత్తు మొదటిశ్లోకమును పరిశీలించము.

**"అతశ్శివ ఏవ సనాతం। బ్రహ్మాభగవానచల ఏవ సత్యం నిరంజనం నిర్వికల్పం। నీ రంధ్రంచ పరాత్పరం। బాహ్యాముపైతివిద్వాన్। అన్య జ్ఞానం నాస్తి జన్మప్రవృద్ధినాస్తిజ్ఞాప్తి సర్వసదా సత్యవాక్యం భక్తి జ్ఞానే కర్మశక్తి చ రహితం సర్వవాప్తం। సచ్చిదానంద రహితం॥**

తా॥ మంగళకరమైన శివశబ్ద వాచ్యమైనదే సనాతనము. బ్రహ్మామైన

భగవానుడచలమే. ఇది యే సత్యం, నిరంజనము, నిర్వికల్పము, ఆకాశమువలె సందులేనిది. శివమును అపరోక్షము గావించుకొన్నవాడే విద్వాంసుడు, జ్ఞాని, ఇతరమైన జ్ఞాన మందులేదు. జన్మపువృద్ధియేలేదు. ఎరుక యెప్పుడు సత్యవాక్యము కాజాలదు. భక్తి జ్ఞాన కర్మశక్తు లా బ్రహ్మ మందులేవు. అది సర్వవాప్తము సచ్చిదానంద రహితము.

**మాయాత్పరం భవేద్యస్తు। తత్పరం పరమశ్శివః**

**సర్వపరిపూర్ణగ్ం సత్యం । శివాదన్యం నకించిన ॥9**

తా॥ ఎయ్యది మాయకంటే పరమైనదో అదిపరమ శివము సర్వపూర్ణమైనదే సత్యము. శివునికంటే భిన్నమైనది యే కొంచము కూడాలేదు.

**అంతఃపూర్ణో బహిపూర్ణః। పూర్ణకుంభ ఇవార్ణవె।**

**అంతర్బహిశ్చ తాద్వ్యాప్తం। శివం సర్వగతం శృణు॥26**

తా॥ పరిపూర్ణము సముద్రమునందు పూర్ణకుంభము వలె నంతః పూర్ణము బహిపూర్ణమై అంతర్వ్యాప్తము, బహిర్వ్యాప్తమై శివమై సర్వగతమై యున్నదని తెలిసి కొనుము.

**దేహబాహ్యస్య మధ్యస్య। అన్తరం వ్యాపితశివః।**

**నిర్గుణం నిశ్చలం బాహ్యం। సర్వకాలేషుసంస్థితమ్॥ 30**

తా॥ దేహమునకు లోపల వెలుపలనడుమ శివయు వ్యాపించియున్నది. నిర్గుణమై నిశ్చలమై బాహ్యము సర్వకాలమందున్నది.

ఇకసర్వ సారపూర్ణోపనిషత్తునందు గల మంత్రములను పరిశీలింతము.

**అప్రమాణ మసంగత్వం। తల్లింగ మచలం భవేత్॥**

**సర్వాకారణ హీనోహి। సఏవ పరమశ్శివః॥ 10**

తా॥ అది అప్రమాణము, అసంగము, దాని గుర్తు అచలమైయున్నది. అదియే పరమశివము. అతడు సర్వకారణ హీనుడు.

**తదేవలింగ మిత్యుక్తం। సయేవ శివ ఉచ్యతే।**

**శివం మధ్యే స్థితం విశ్వం। శివాదన్యంనకించన॥22**

తా॥ అదియే లింగమని చెప్పబడుచున్నది. అదియేసదాశివుడు. శివుని మధ్య యందు ఈ విశ్వమున్నది. అనగా తోచుచున్నది. శివుని కంటే భావించదగినది యేదిలేదు. పరిపూర్ణబోధ యంతయు భావనారూపమే.

**శివాదన్యమితిర్నాస్తి। త్రిలోకేషు నిశ్చితమ్।**

**ద్రష్టాదృశ్యవశాద్బంధః। ద్రష్టా భావెకుతో భయమ్॥ 23**

మూడులోకములందు శివము కంటే వేరైనది లేదని నిశ్చయించబడినది. దృశ్యవశమున ద్రష్ట బంధింప బడుచున్నాడు. ద్రష్టయే లేనిచో భయము లేదు. భయము లేనిచో సంశయమేలేదు. సంశయ రహితమే భ్రాంతి రహితము. భ్రాంతి రహితమే జన్మరాహిత్యరూప మోక్షము.

**నిరహంకారేణ చిజ్జడాత్మ కావరణంచిత్వా।**

**నిరామయ నిరంజన పరమం శివమాలోక్య నిరహంకారో భవ ॥32**

తా॥ నిరహంకారముతో చిజ్జడాత్మకమగు నావరణమును భేదించి నిరామయుడును నిరంజనుడగు పరమశివుని కనుగొని నిరహంకారుడవు గమ్ము.

**ఆత్మా నాత్మ రహిత పరిపూర్ణ పరమాకాశ నిరతిశయ**
**నిరీశ్వర లింగ మధ్యే విలీనోభవ ॥ 33**

తా॥ ఆత్మా నాత్మ రహితమైన పరిపూర్ణ పరమాకాశ రూపమగు నిరతిశయ నిరీశ్వరలింగ మధ్యమున విలీనుడవు కమ్ము.

అచలర్షి శ్రీ పండిత శివానందస్వామి విరిచిత శ్రీమదచలబోధ శిఖామణి యందలి జగదుత్పత్తి నిరూపణ నిరసన ప్రకరణమునందు శివమును యిట్లు వర్ణించినారు.

**శ్లో॥ నిరాఖ్యాతం నిరాభాసం నిస్తేజోనిర్మలం సదా। నిర్మయత్వం, నిరాశత్వం తల్లింగం పరమంప్రభుం॥** ఎరుకానుభవ ప్రకరణమునందు

**శ్లో॥ సర్వద్వంద్వ వినుర్ముక్తం, సర్వోపాధి వర్జితం।**
**సర్వమోహ నిరాహిత్యం తల్లింగం పరమం ప్రభుం ॥**

**శ్లో॥ శివోవా సర్వభువనం భువనం నామ సంత్యజ ।**
**శివోహమితి నిశ్చిత్య చాహం భావం పరిత్యజ ।** సంపూర్ణశ్రుతులనుండి.

**శ్లో॥ ప్రకృతి పురుషరహిత సర్వాతీత స్వభావ నిరాకాశ శివః ।**
**తన్నిరంజన నిరామయ । సర్వగత నిరాకాశశ్శివః॥**

## 2. లేని ఓం కారములేనే లేదు

**ప్రణవార్థ విహీనాత్మాలక్ష్య వాచ్యవివర్జితః॥**
**శుద్ధ చైతన్య హీనాత్మా సర్వభాస వివర్జితః ॥** సర్వసారపూర్ణోపనిషత్తు -13

తా॥ శివమునందు ప్రణవమనగా ఓంకారము లేదు. అది లక్ష్యార్థములకు వాచ్యార్థములను వదిలినది. శుద్ధ చైతన్యము కూడా లేనిది. అన్ని ప్రకాశింపజేయునటు వంటిది కాదని స్పష్ట పరిచినదీ ఉపనిశద్మంత్రము.

శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు ఓంకారమును యెరుకని స్పష్టపరిచిన విధంబును పరిశీలింతము.

ఈ ఓంకారమును అచల ఋషులు సుదీర్ఘంగా ఆలోచించి సృష్టికిమూలం ఓం కారమేయని అంగీకరించిరి. సృష్టి వలననే సకల జీవోపాధుల జననమును వాని మనుగడయు కొన సాగుతున్నదను మాటనుకూడా ఆమోదించిరి. అయితే దేనివల్ల జన్మ కలిగినదో దాని వలననే జన్మరాహిత్యస్థితి కూడా కుదుర గలదను భావము ఎంతవరకు సమంజసమో విచారించెదము- శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద. 122 **"పంచా శదక్షరముల । ప్రపంచము తానుద్భవించె ప్రణవాక్షరమం। దంచు శృతులెన్నె । దాన్నెరుకంచని నీవెరిగి। యెరుగు మచలాముదీనన్। నిల్పకు మెరుకా నచలాములోనన్॥** సెలవిచ్చినారు.

తా॥ ఏబది అక్షరములచేత విస్తీర్ణమైన ప్రపంచము పుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. ఆ ప్రణవము యెరుక నిర్ణయమని తెలుసుకొనుము శివమును తెసులుకొని (నిరాలంబంను తెలుసుకొని) ఆ శివమునందు ఈ ఎరుక అయిన ఓం కారమును నిల్పకుము అని సెలవిచ్చియున్నారు.

ఏబది అక్షరములకు మూలము ప్రణవమని శ్రుతులు నిర్ణయించుటకు కారణమేమనగా శ్రుతి **"ప్రణవోయీ పరబ్రహ్మ ప్రణవశ్చ పరస్మృతః"** అనగా ఓం కారము

నిశ్చయముగా పరబ్రహ్మము. ప్రణమే పరమాత్మయని చెప్పబడుచున్నది. కనుక వాచ్యమగు బ్రహ్మమునకు వాచకమగు ఓం కారము ఏబది అక్షరములకు మూలమని నిర్ణయము. ఈ శబ్దము పరా పశ్యంతి, మధ్యమ వైఖరీ వాక్కు రూపములో అన్నిటియందు గలదు.

అకార ఉకార, మకార, అర్ధ మాత్రుకలతో కూడి నదే చతురాక్షరీ స్వరూపమైన ఓంకారమే శ్రేష్టమని నిర్ణయించి కొనుట ఒక భావము. దాని కతీతమైన శివమును గురు సూచన ద్వారా గుర్తెరిగి, ఎరిగిన ఓం కారమును (ఎరుకను) విడుచుటవల్ల మానవ జన్మ సార్ధకమగును. అప్పుడు ఓం కారమే పరబ్రహ్మయను భావము అభావమగును.

చతురాక్షరీ స్వరూపమైన ఓం కారము నిల్వదని శ్రీ కృష్ణదేశికులంటే **నిశబ్దో బ్రహ్మవుచ్యతే** "అను పదభావము గ్రహించి దానిని గుర్తుగా రూపము నిచ్చి **"ఒఓం"** గా సిద్ధాంతీకరించినారు. దానిని పరిపూర్ణ సిద్ధాంతమునకు ప్రతీకగా శ్రీకృష్ణదేశికేంద్రులవారు చాటిరి.

276 క.ద. **"ఒంటుకు దాపల బింద్వాం। ట్లంటించినకొలది లెక్క యధికంబగునా। వొంటుకు వలపల బింద్వొక। టంటించిన లెక్క ఉళ్ళక్యాగదోయి। ఒంటుండి లేందౌగదోయి"॥** అని సెలవిచ్చిరి. మరియు శ్రీ భూమానందు మందిప్పల హనుమంత రాజయోగి గారు **శంకలు దీరెను వినుమిది అంకెలలో ఒంటునొకటి ఆత్మన బడునా। రంకుల బొంకుల జగమిది వంకలు లేనట్టి యచలం వాసీగ గనుడీ। పై సున్నిడి వైకుంఠమనుడీ"** ఇయ్యది ఆత్మాతీతం కేవలాత్మ యనుశ్రుతిని బలపరిచినది. దీనినే 010 గుర్తుతో వ్యక్తపరిచిరి.

ఓం కారమును వివేచన చేయగా నాలుగు మహావాక్యముల సారము కూడా అంతే అని తెలుచున్నది. అందువలన ఓం కారమే సృష్టికి ఆధారమగు అధిష్టాన చైతన్యమనియు సకల జీవోపాధుల సృష్టి స్థితి లయములకు మూలమని తేలినది. కాని దానికి మరొక మూలము లేక పోవుట వలన మూలము లేని ఈ గుర్తెరిగే శరీరము యేమి లేదని అచల ఋషులు నిర్ణయించిరి. **"ఓం నిశ్శబ్దో, బ్రహ్మవుచ్యతే"** అనుభావమును ఆశ్రయించితే జన్మవచ్చును. తద్రహితమందే జన్మరహితస్థితి సిద్ధించునని తెలియజేయుటకే ఒఓం అనే గుర్తు ద్వారా తమ సిద్ధాంతమును చాటి చెప్పిరి. అందుకే వారి నిర్ణయములోక కల్యాణమైనది. దానిని మన మవగత మొనర్చు కొని జన్మరాహిత్యస్థితిని పొందెదము గాక !

## 3. నమః

న అంటే లేదు. మః అంటే నేను, నమః అంటే నేనులేను. నేను లేననుటయే యెరుక (ఓంకార) రహితము. ఓం కార రహితమందే శివ మపరోక్షము. **" తన్ని వృత్తిమోక్షః** తన రహితమందే మోక్షము. శివునకు నమస్కారమంటే శివుని (నిరాలంబంను) ఉపాసింపుము. అంటే నేను లెననే భావము లోవుంటే శివుని ఉపాసించినట్లు, శివునికి నమస్కరించి నట్లుని గ్రహించవలయును.

**పూర్ణమన్యంతరం నాస్తి తచ్ఛివం సదుపాస్యసి ।**
**నేతి నేతీతి నేతీతి శేషితం పూర్ణముచ్యతే ॥ సర్వసారపూర్ణోపనిషత్తు. -3**

శివము తప్ప తదితరమంతయులేనిది. ఆ శివుని ఉపాసింపుము. అతద్వ్యావృత్తి లక్షణముచే యిది కాదు యిది కాదు యిది కాదని అంటూ నామ రూపములన్నింటిని నిషేధించగా మిగిలిన దేదో అదే శివము, పరిపూర్ణము. నిరాలంబం.

ఈ శ్లోకమునందు తచ్ఛివం సదుపాస్యసి అని చెప్పబడినది, మంగళకరమైన శాశ్వతమైన శివము, తాను గానిది, తానులేనిది, ఏమి గానిది, మరి దానికి నమస్కారమెట్లు? పరిపూర్ణపరబయలునకు 'మెక్కెరితర జేజేలు' ఆత్మ స్వరూప జ్ఞానులే జేజేలు అట్టి వారి కన్యమైన వారిచే సేవింపదగినది ఈ శివమే. సేవ లేక ఉపాస్యవస్తువు, ఉపాసన, ఉపాసకుడనె త్రిపుటి స్థిరమగుచున్నది. ఉపాసింపదగినది బ్రహ్మమే కాదు. **"తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదంయదిధ ముపాపతే"** అని కేనోపనిషత్తు ప్రవచనము.

కనుకనే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద. 30 "ఎరుక లేక సేవింపదగూ" నన్నారు. కావున తాను లేననే భావనలో యుండుట యే శివమునకు నమస్కారము. సర్వసార పూర్ణోపనిషత్తు ఈ భావమునే బలపరుచుచున్నది. **" నిర్దేహం నిర్మలం పూర్ణం తల్లింగమచలం భవేత్। మాయాపి వందితం బాహ్యాయే తధ్యానం కురుసర్వదా॥"** 19.

తా॥ శరీరము లేనిది, నిర్మలమైనది ఆ లింగమే అచలము. మాయా బ్రహ్మలచే వందనము చేయబడునది శివమే. ఎందుకనగా మాయాబ్రహ్మలు రెండు ఒకటే వేర్వేరుగావు. అద్దానిని ఎల్లప్పుడు ధ్యానము చేయుమంటుంది ఈశ్లోకము. ఎరుక లేక సేవించుటయనగా నేను అను అహంవృత్తిని వదలియుండుటయే శివమునకు నమస్కారము.

ప్రత్యక్బ్రహ్మైక్యరూపమగు తనకు దశదిశయందున్నది ఆ శివమే. ఆ దశదిశల యందున్న శివ మును అచల ధ్యానము స్పష్టపరిచినది.

శ్లో॥ పూర్వమేవా నిరాలంబం.... అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః॥ ఇందు దశదిశలయందేగాక అంతర్బహిశ్చ అని చెప్పుటచే దేని ప్రాతిపదికగా ఈదశదిశలు చెప్పబడినవో అది శివమునందుండుటకు వీలు లేదు. కనుక దానిని లేనెరుక యని శ్రీకృష్ణదేశికేంద్రులవారు పేరిడిరి. క.ద66 " **లేని కల కలిగినప్పుడు దానికి దశదిశల యందు తగమొదట కొనన్। తానంటకున్నమేల్కను లేనికలే చూచెనేని। లేక పోవుగదా॥"** అంటూ దృష్టాంతమిచ్చి యున్నారు. ఎరుకను అధిగమించి దాని ద్వాదశ స్థానము లందున్న శివమునకు నమస్కారమంటే అర్థమేమనగా ఎరుకను (ఓం కారమును) విడుచుటయే । నమస్కారము.

**" స్వయం బ్రహ్మ మయో భూత్వాతత్పరం చావలోకయేత్" 212** అని గురు గీత గానం చేసినిది. నీ నిజస్వరూపమగు ఓం కార స్వరూపుడవై నీకు పరంగా నున్న శివమును చూడుమంటుంది. అది నీవుకాదు, నీ వది కాదు. నేను లేనిది అని నీయందలి బ్రహ్మనైతిని అనే బ్రహ్మ భ్రాంతిని వదిలినప్పుడు సర్వ భ్రాంతి రహితమగుటవల్ల తిరిగి జన్మరాదు. **తాను తాననే భ్రమ విడిచి చూడక చూస్తే అంతా అచలమే,** అంతా పరిపూర్ణ పరబ్రహ్మమే,అంతానిరాలంబమే అంతాశివమే రెండవది యేది కాదు యేమిలేదు. ఈ విషయములన్నిటిని సాంప్రదాయ గురువుల ద్వారా తెలుసుకొని తరింతరు గాక !!! మరొక శ్లోకము.

**సర్వాంతస్థంశివం ధ్యాత్వా సర్వ భావాన్ విసర్జయేత్।**
**జ్ఞాన మంతర్బహిర్ధ్యాత్వా జ్ఞాతృ జ్ఞానం పరిత్యజ ॥**
**సర్వసార పూర్ణోపనిషత్తు 42**

తా॥ సర్వము నందు నిండియున్న శివమును ధ్యానించి నమస్కరించి అన్ని తలంపులను కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా వదులుము. జ్ఞానము అంతర్బాహ్యముల ధ్యానించి జ్ఞాతృ జ్ఞానములవిడువుము.

కం॥ **భావా భావములంటక**
**సేవించెదు బట్టబయలు స్థిరమతి లోనన్**
**కేవల శివ పర ధ్యానము**
**తావరము గన్న వాడె ధన్యుడువేమా ॥**

తా॥ భావా భావము అంటక వున్నది ఏది? శివము. బట్టబయలు కేవల శివ పరధ్యానము తావరము ఏది? ఆ పరిపూర్ణపరబ్రహ్మమే, శివమే. దానిని స్థిర మతితో కన్నవాడే ధన్యుడు. అట్టి ధన్యుడు భావాభావము లంటక సేవించవలెను. మరి ఎట్లు సేవించవలయును? శివము నందు నేను లేనే లేనని, నాకు స్థానము లేదు మూలము లేదని త్రికరణ శుద్ధిగా కర్తృత్వ రహితముగా కర్మాచరణ చేయుటయే యెరుకను ఓంకారమును అంటక నడుచుకొనుట. అప్పుడే సద్యోముక్తి

**శ్లో॥ అశరీరం సర్వదా ఽస్తి శరీరం రహితం సదా। అయమేవ సద్యోముక్తి రన్యధా భ్రమకారణమ్॥** శరీరము లేని శివమే ఎల్లప్పుడు వుండియున్నది. శరీరము ఎప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించుచున్నది.

**ఇన్ద్రజాలమిదం సర్వం యథా మరుమరీచికా !**
**అఖండిత మనాకారం కేవలం వర్తతే శివం ॥**

తా॥ ఈ దృశ్యమంతయు యింద్రిజాలములలో తోచు సమస్త సముదాయమువంటిదే. ఎండమావులలో జలమువలె భ్రాంతి గొల్పుచున్నది. నిజముగానున్నది శివమొక్కటే. అది అఖండము నిరాకారము, కేవలము.

జాలము అనగా మాయ, గారడి, 'యా మా సా మా య' అనునట్లు యేది లేనిదో అదిమాయ, నిజముగా లేనిదానిని వున్నట్లు భ్రమింప జేయుటయే జాలము.

ఇదం సర్వం: ఇంద్రియముల చేతను, మనస్సు చేతను తెలుసుకొనెడి సమస్తము కూడా అనగా సాకార నిరాకారము ఏదేది తెలియసాధ్యమైనదో అది తత్వము. మనస్సు ఇంద్రజాలమువంటిదే నన్నమాట. కనుక సర్వము చిన్మాత్రమే, చిద్రూపము గాని వస్తువు లేదు. శివం ఒక వస్తువే గాదు. శివముతప్ప అన్యమంతయు చిన్మాత్రమైన యెరికే. ఇదం చే సూచితము అది ఎండమావులలో జలమువంటిది.

**శివము అఖండితము అనగా ఛేదింపబడనిది అనగా ఖండములు కానిది, అవిచ్ఛినమైనవి.**

**అనాకారం** అనగా యెట్టి ఆకారములు లేనిది. నిరాకారం ఆకారములేనిది. ఆత్మయే సర్వాకారములుగా నున్నది. పరిణామ వికారములుగాని దేదో అదే శివం.

**కేవలం:** ఆ శివం కేవలం అనీ చెప్పబడినది. కేవలం అనే మాటలో సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యమై తాను తప్ప అన్యమేమి లేని పరిశుద్ధమైనదని అర్థము.

ఇట్లనుటలో అది సర్వశుభప్రదమైనదని, మంగళ కరమైనదని అర్థము. శాశ్వత జనన మరణ రహితము సిద్ధించుటకన్న శుభము మంగళకరమైనది. మరొండు లేదుగదా! అట్టి జన్మరాహిత్యరూప మోక్షము పరిపూర్ణబోధవల్లే సిద్ధించును.

నిష్క్రియమైన శివమునకు వర్తతే అనేక్రియా పదమును జోడించి చెప్పబడిన దనవచ్చును. కాని వర్తతే అనె పదమునకు వర్తించుటతో పాటు 'వుండటం' అనే అర్థము కూడా కలదు. ఉన్నదే అది మరొకటి లేదు. ఉన్నదని కూడా చెప్పవచ్చునా? "న చక్షుర్గచ్ఛ నవాగచ్ఛతి నోమనః" మరియు **"అస్తీతోవోపలబ్ధవ్యః"** అంటున్నాయి శ్రుతులు. అస్తి-నాస్తులు రెండు పరస్పర సాపేక్షకములుకదా! మరెట్లు? అస్తీతి బ్రువతోన్యత్ర కథం తదుపలభ్యతే అది వున్నదని చెప్పుటకు వినా మరొక విధంగా ఉపలబ్ధి గాదు. గురుముఖంగానే తెలియవలయును. ఉన్నది గురుడన్నది నేకన్న దంతట నున్నది. వున్నదేమో వున్నది నేనన్నదే లేకున్నది" శ్రీ భూమానందమంది ప్పల హనుమంతరాజయోగి గారు ఒకతత్వమునందు సూచనజేసియున్నారు.

**"ఇతివేదాంత సిద్ధాంతసారం। వేదాంతడిండమః। మృతం జన్మద్వయం నాస్తి। భయభ్రాంతి వినశ్యతి॥"** సర్వ సారపూర్ణోపనిషత్తు - 67. తా॥ ఇదియే వేదాంత సిద్ధాంత సారమగు వేదాంత డిండమము. మరియు దీనిని విన్నవారికి కన్నవారికి జనన మరణములుండవు. భయ భ్రాంతులుండవు. అని స్పష్ట పరచబడినది. గురుముఖంగా ఈ మంత్రమును లక్ష్యలక్ష్యార్థముగా వినికని తరింతురు గాక !

" పరిపూర్ణభావము మళ్ళిచెప్పబడుతున్నది. పునరుక్తిదోషము కాదు విషయము దృఢమగుటకేనని గమనించ గలరని ప్రార్థన. చూడుము క.ద. 13.

**గురవే సచ్చిదానందమూర్తయే.**

గురువు సచ్చిదానందమూర్తి. ముందుగా గురువంటే ఎవరో విచారింతము.

**శ్లో॥ గుకారః ప్రథమో వర్ణః । మాయాది గుణభాసకః।**
**గుకారో 2 స్తి పరబ్రహ్మ । మాయాభ్రాంతి విమోచకం ॥** గురుగీత

తా॥ గురు పదము నందలి మొదటి వర్ణమగు గుకారము మాయాది గుణములను ప్రకాశింపజేయుచున్నది. రెండవ వర్ణమగు రుకారము మాయయొక్క భ్రాంతిని నశింపజేసెడి పరబ్రహ్మస్వరూపమై యున్నది. ఇట్లు గురుపదము మాయగాను, పరబ్రహ్మముగా నున్నది.

శాస్త్రమునందు అష్టవిధములగు గురువులు చెప్పబడినారు. వారి కతీతమైన పరిపూర్ణ గురువే గురువు.

**క.ప॥196 సదమల గురువెవరనినను యిదిగో బయలిదుగో లేని యీగురుతెరిగేటి దగు శరీరము దీనిని। వదులుమనుచు జెప్ప వచ్చిన వారే ॥** తా॥ పరిపూర్ణ మెరుకల నెరింగించి యెరుకను రహితపరచి జనన మరణ భ్రాంతి తొలగించు వాడే గురుడు. **కం॥ 131ఎరుక తనకు దావిడిపో। దెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్। గురుడొకడు తప్ప....."** ఎరుకను విడిపించు పరిపూర్ణగురువే నిజమైన సద్గురువు. **సచ్చిదానందము** అనగా

**సతు** అనగా త్రికాలములచే బాధింపబడక అనంతమైన అఖండ యునికి యే సత్తు **చిత్** అనగా సర్వజ్ఞత్వ లక్షణములతో కూడిన అంతులేని జ్ఞానమే చిత్, **ఆనందము**

అనగా సుఖదుఃఖములు గాని అనంతమగు విలక్షణస్థితియే ఆనందము. గురుపరమాత్మకు సచ్చిదానందములు స్వరూప లక్షణములుగా జెప్పబడినది.

కార్య రూపమగు సృష్టి యందట కూడా సచ్చిదానందములు ఏ స్వల్పపరిణామములో యేదోరూపంగా వుండవలసినదే. ఉదాహరణకు ఒక చిళ్ళ పెంకునందు కూడా ఉనికి కలిగి యుండుటచే సలక్షణము. అందలి అణుసముదాయము పరస్పరము కరిచిపెట్టుకొనియుండుటకు కారణమైన శక్తి రూపము చిల్లక్షణము. ఏ స్వల్ప ప్రయోజనముకో అవసరమై యుండుటచే ఆనంద లక్షణము ఆ చిళ్ళపెంకు యందు ద్యోతకమగుచున్నవి. ఈ విధముగా సచ్చిదానందములు సర్వేసర్వత్రా గోచరించుట చేత కూడ. **" ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మస్వరూపకం"** అని వర్ణించ బడినది. బ్రహ్మ స్వరూపమే గురుస్వరూపము. కనుక గురు స్వరూపము గాని కించిత్తూ లేదని చెప్పబడినది. కనుక గురువు సచ్చిదానంద స్వరూపుడు అని ఇతరులంటారు. కాని అపరబ్రహ్మ స్వరూపమున కతీతమైన వాడు గురువు మొదట గురువు సచ్చిదానంద స్వరూపుడు అనగా ఎరుక స్వరూపుడు అయిన తర్వాతనే అతడు ప్రపంచము లేని వాడు, శాంతుడు నిరాలంబుడు, తేజోవంతుడు అగును. అంటే ఎరుకను వదలి నిరాలంబమును ప్రబోధించు వాడే గురువు అని నిచట చెప్పబడినది.

**నిష్ప్రపంచాయ = ప్రపంచము లేని వాడు**

గురువు ప్రపంచము లేనివాడు గురువు ప్రపంచము లేదనే భావనలో యుండును. **శ్లో॥ శుద్దేసుష్పుస్తావిచ । తస్మిన్నాహం కదాచన। తస్య సదాపియస్యాస్తి। ప్రపంచం నాస్తి తస్యవై॥** భ్రాంతిరహిత శ్లోకం ॥

తా॥ నిర్మలమైన అచలపరిపూర్ణ పరబయలునందు యందు నేను ఎప్పుడు లేనని తెలుసుకొనుచున్నాడో అట్టి పుణ్య పురుషునకు (గురువునకు) ఈ కనబడె ప్రపంచము లేదని భావము. అచల గురుమూర్తి ఎల్లప్పుడు ఇట్టి భావనలో యుంటాడు. కావున అతనికి ప్రపంచములేదు.

**శాన్తాయ = శాంతుడు**

అనగా గురుడు శాంత స్వరూపుడు. శాంతుడు అనగా ఒక్క కోపము మాత్రమే లేకపోయిన శాంతుడు కాదు. అంతః కరణమున అలజడి, ఆందోళన, ఆరాటము, కలత చీకాకు చింత యిత్యాదులు లేకుంటే శాంతి, శాంతుడు. ఆకాశము యొక్క స్థూలాంశ గుణములగు, కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యములు వలన కోపము జనించును. కోపము వలన సమ్మోహము, స్మృతి భ్రంశము, బుద్ధి నాశనము వరుసగా కలిగి సర్వనాశనము గావించును. ఈ అంతటికి మూలకారణము విషయ చింతన. విషయ చింతన చేయని జ్ఞాని అంతః కరణము శాంతికి నిలయమై యుండును. పరిపూర్ణ పరబాహ్యమందు తానైన ఎరుకకు స్థానము లేదు. మూలము కూడా లేదని నిశ్చయజ్ఞానము గల గురువు భ్రాంతి రహితుడు. కనుక యతని అంతఃకరణమున కోరికలు జనించవు. జనించిన అవి వానిని బాధించవు. కావున అట్టి అంతఃకరణమును గురువు కలిగి యుండును. కావున గురువు శాంత స్వరూపుడు.

**నిరాలంబాయ = నిరాలంబుడు**

గురుడు నిరాలంబుడు. పరిపూర్ణభావజ్ఞుడు. నిరాలంబము అనగా ఆధారము లేనిది, స్వతంత్రము అని నిఘంటువు అర్థములై వున్నవి. నిరాలంబము అనగా అచల పరిపూర్ణపరబ్రహ్మము. అచల పరిపూర్ణ పరబ్రహ్మము దేనికి ఆధారముగాదు. దానికి మరొక ఆధారము లేదు. అట్టి నిరాలంబమను - పరిపూర్ణ పరబాహ్యమును శ్రీ శివరామ దీక్షితుల వారు తమ బృహద్వాసిష్ఠమునందు యీ క్రింది విధముగా వివరించియున్నారు.

**"పుట్టనిదీ - చావనిదీ, రాకడపోకడ లేనిది, సకల దేశాలయందు, సర్వకాలాలయందు, సమస్తమైన వస్తువులయందు, మొదలు కొనలేక, చలించక, ఒక్క తీరుగా తనకు తానే స్వతసిద్ధమై యున్నది.** అంతే గాక కేవలాత్మ - అచలనాములనే శీర్షిక యందు (50)వ పేరును **నిరాలంబం** అనిపేర్కొన్నారు. నిరాలంబం అనగా కేవాలాత్మ, పరిపూర్ణ పరబ్రహ్మమని రూఢియగుచున్నది. మరియు సాందీప వాక్యములందు 141వ వాక్యము **"ఈ శరీర మందున్నది గుర్తెరిగె చైతన్యము విసర్జించితే నిరాలంబమే స్వతసిద్ధము"** అని పేర్కొనబడినది. అనగా అచల పరిపూర్ణ గురువు ఈ శరీరము నందు వున్న గుర్తెరిగె చైతన్యము (అనగా ఎరుకను) ను వదిలియున్నవాడు. కనుక నిరాలంబుడు.

**తేజసే = తేజోవంతుడు**

అనగాగురుడు తేజోవంతుడు. గురుగీత చతుర్థాధ్యా యమందున నిజగురులక్షణములు తెలుపుతు

**శ్లో॥ గుకారశ్చాంధకారోహి। రుకారస్తేజ ఉచ్యతే।**
**అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ। గురు రేవన సంశయః॥ 98**

అని గురుగీత గానం చేసింది. తా॥ గుకారమే కటిక చీకటి గాను, రుకారమే కటిక చీకటిని నశింపజేసెడి జ్ఞాన తేజస్సు గల పరబ్రహ్మము గురువే యగుచున్నాడు. దీనికి సంశయము లేదు. గురుశబ్దము నందలి గు కారము చీకటి. చీకటి అనగా శిష్యుని అజ్ఞానము. "రు" కారము అంధకారము పోగొట్టి తేజస్సును అంటే శిష్యునికి జ్ఞానము కలిగించును. కనుక గురువు తేజోవంతుడని ఇతరులచే పిలుప బడుచున్నాడు. చీకటి (అజ్ఞానము) తేజస్సు (జ్ఞానము) రెండుకలిసే యున్నవి. కలిసే వచ్చినవి, కలిసే పోవును. అజ్ఞానము నాశనము కావలయునన్న జ్ఞానమున్ను వినాశము పొందవలసి యున్నది. ఇట్టి జ్ఞానా జ్ఞానముల కునికి పట్టయిన వస్తువు పరమాత్మకు పరిపూర్ణ పర బయలందు మూలము లేదు, స్థానము లేదు అని పరిపూర్ణ బోధచే నిరూపించి మూలాజ్ఞానమును శాశ్వతముగా రహితమొనర్చగలవాడు కనుక గురుడు తేజోవంతుడు పరిపూర్ణుడు.

**నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతియః సయద్య సన్యాసీచ యోగీచ కైవల్యం పదమశ్నుతే.**

ఈ వాక్యము ఈ ఉపనిషత్తులోని అచల సిద్ధాంతము. అనగా ఎవడు ఆలంబనమును వదలి పెట్టి నిరాలంబమును పరిపూర్ణ పరబ్రహ్మమును ఆశ్రయించునో అతడే సన్యాసి, యోగి, అట్టి యోగి కైవల్యమును పొందు చున్నాడు. ఇది పరిపూర్ణ ప్రబోధామృత సిద్ధాంతము. ఈ ఉపనిషత్తునకు ప్రాణము వంటిది.

ఆలంబనము అనగా ఎరుక. ఎరుకనగా శుద్ధజ్ఞానము యొక్క మారు రూపమే జగత్తు. కనుక సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఏకమేవాऽ ద్వితీయం బ్రహ్మ" "ఏకం అనేకం భవతి" ఇత్యాది శ్రుతులలో నున్న బ్రహ్మశబ్దమునకు పర్యాయ పదముగా అచ్చ తెనుగున **"ఎరుక"** అనే శబ్దము వాడినారు. ఎరుకనగా ఎరిగేటిది. సంస్కృతములో జ్ఞాన శబ్దముచే చెప్పనగును. జ్ఞానముతో తెలుసుకొనువాడు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయములు త్రిపుటిగా ఏకవస్తువు నందు పర్యవసించుచు వ్యష్టి రూపమున అంతః కరణముగా నున్నది. కాని దానికి అత్యంత మూలకారణవస్తువు సచ్చిదానంద లక్షణములు గల కారణబ్రహ్మము.

ఎరుక, ఎరుక- మరుపు అను రెండురూపములుగానున్నది. ఎరుక తనను తాను యెరిగినపుడు ఎరుక, తనను తాను మరచి నపుడు.మరుపు అన బడుచున్నది. మరుపు స్థితి యందు గుర్తెరిగే తెలివి రూపమైన ఎరుక యేమి లేదు. మరుపునందు ఎరుక తాత్కాలికముగాలేదు. గాని తిరిగి ఎరుక రూపము వహించుచునేయున్నది. అంటే ఎరుక నిరంతరము మారుతున్నది. మార్పు చెందునదే ఎరుక. ఇది నిరంతర పరిణామశీలి. ఎరుకనగా శ్రీకృష్ణ దేశికులు సెలవిచ్చినట్లు **కం.ద. 45 పిండబ్రహ్మాండములు రెండును యారెంటిలోని రెండహములు యీ। ఖండములు నాల్గు కూడి అఖండం బగు ఎరుక రూపు। గనరామా తండ్రి......"** అని సెలవిచ్చుయున్నారు.

భావము : ఆ పాదమస్తక పర్యంతము తెలియుచున్న వ్యష్టి ప్రాణము పిండమని, దాని యందలి వ్యష్టి మనస్సు అహంమని, పృథ్వి ఆకాశము వరకు తెలియుచున్న సమిష్టి ప్రాణము బ్రహ్మాండమని, దాని యందలి సమిష్టి మనస్సు అహమని నిర్ణయము. ఈ పిండ బ్రహ్మాండములు రెండు వీటి అహములు నాలుగును గూడి అఖండంబగు ఎరుకయన బడును. ఈ వాస్తవమును తెల్పు సద్గురువే తల్లి దండ్రి. ఇట్టి అఖండ ఎరుకనే సాలంబనమనికూడ అందురు. సాలంబనము అనగా వారి మాటలలోనే మరొక

క.ద 46 **"ఎరుకే దేహేంద్రియములు। ఎరుకే వర్ణాశ్రమములు। యెరుకే శ్రుతులున్। ఎరుకే నీవును నేనును। ఎరుకే సతి సోదరాదు। లెరుగుమూ వత్సా నే దీర్చెద నిదుగో నీయిచ్ఛా। హరి, హర, బ్రహ్మాది, సుర, నర, గిరి,సరిత్తరు మృగమఖ చరాచరములు ఎరుకాని ఎరుగుము వత్సా...."**॥

భావము : ఓ వత్సా ! దేహములు యింద్రియములు ఎరుకనే, వర్ణములు ఆశ్రమములు యెరుకనే, నీవు నేను ఎరుకనే, సతి సోదరులు ఎరుకనే, శ్రుతి స్మృతులు యెరుకనే ఇదిగో నీకోర్కెను తీర్చెదను. హరి, హర, బ్రహ్మాది నియమిత దేవతలును, నరులు, పర్వతములుల, నదులు, స్థావర జంగమ జీవోసాధులన్నియు ఎరుకనేయని భావము. ఒక్క మాటలో చెప్పవలెనంటే నిరాలంబము (పరిపూర్ణ పరబయలు) తప్ప తక్కిన దంతా సాలంబనమే ఎరుకనే అని తెలియవలయును.

నిరాలంబము అంటే పరిపూర్ణమని యిది వరకే మనము తెలుసుకొన్నాము. సాలంబమును (ఎరుకను) వదలి నిరాలంబమును ఆశ్రయించిన వాడే సన్యాసి, యోగి. అట్టియోగి కైవల్యము ను పొందును. అదెట్లో పరిశీలింతము.

ఆ॥ రూపడగక జీవ రూపంబు గనరాదు
అట్టి రూప మడగ నలవి గాదు
బ్రహ్మ మడగకున్న బ్రహ్మంబుగనరాదు
విశ్వదాభిరామ వినురవేమ ॥

ఈ స్థూల శరీరము మనషికి రూపము, ఈస్థూల శరీరమును ఆశ్రయించి యున్న సూక్ష్మము జీవము. ఈ జీవమును ఎట్లు చూడవలయును ? జ్ఞాన నేత్రముచే చూడవచ్చును. మనస్సును సూక్ష్మము జేసి అనగా విషయేంద్రియము లైన పంచ తన్మాత్రలనుండి విడువడునట్లు చేసిన అప్పుడు మనసు తన వశమగును. అట్లు వశమైన మనస్సుకు అన్య గ్రహణముండదు. ఈ విధముగా మనస్సును అణచి చూచిన యెడల మనస్సు బ్రహ్మకారము వహించిన స్వస్వరూపమును చూడవచ్చును. ఇదే అఖండ ఎరుక స్వరూపము, ఆత్మ సాక్షాత్కారము, బ్రహ్మ స్వరూపము. ఇదే ఆలంబనము. ఈ బ్రహ్మమే చ్యుతి జెంది జీవేశ్వర జగత్తు అయింది. నిరంతరము మార్పు చెందెడి మాయ అయింది. కనుక ఈ ఎరుక బ్రహ్మము లేక ఆలంబన బ్రహ్మము సత్యము గాదు. అశాశ్వతము.

ఈ పద్యము లోని మూడవ చరణమును పరిశీలించిన బ్రహ్మమడగకున్న బ్రహ్మంబు గనరాదు అని స్పష్టపరిచినది. ఇందు మొదటి బ్రహ్మము ఆలంబన బ్రహ్మము ఎరుక బ్రహ్మము. రెండవ బ్రహ్మము నిరాలంబన బ్రహ్మము, పరిపూర్ణ పరబ్రహ్మము. అంటే ఆలంబన బ్రహ్మము వదులకుండ నిరాలంబన బ్రహ్మము అపరోక్షము గాదు. నిరాలంబన బ్రహ్మము అపరోక్షమైన సాలంబన బ్రహ్మ తనంతటతానే లేంకుండ పోవును. అఖండాత్మ దృష్టి అలవడినవాడు కృత కృత్యుడే. కాని నీ స్వరూప జ్ఞానము కలుగుటతో నీవెవరో నీకు తెలిసినదని అచల ఋషుల నిర్ణయము. దానికి భిన్నము గానున్నది. **"సోऽ2 న్వేష్టవ్య సజిజ్ఞాసితవ్య"** అనగా వెదుకదగినది, జిజ్ఞాస చేయబడినదేదో దానిని నీవు తెలుసుకొంటివి. శ్రవణ మనననిధి ధ్యాసలచే తెలియదగినది నీకు ద్రష్టవ్యమైనది. కాని **"నైవవాచా న మనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా..."** అని కఠోపనిషత్తు **" స ఏష నేతి నేత్యాత్మ 2 గృహ్యోనహిగృహ్యతే"** అంటూ బృహదారణకోపనిషత్తు అంటున్నది. ఎరుకచే తెలియబడదని చెప్పె పరిపూర్ణ పరబ్రహ్మము నిరాలంబన బ్రహ్మము నీ స్వరూపమునకు అన్యంగానున్నదిగదా ! దాని యందు నీ నిజ స్వరూపమునకు (ఆలంబన బ్రహ్మము) మూలము గాని స్థానము గాని లేదు అది ఆలంబనమును మీరినది. కనుక దానిని ఎరుక లేక సేవించవలయును. అంటే నీవైన బ్రహ్మమును విడిచి, అతిక్రమించినపుడే పరిపూర్ణపరబ్రహ్మము అపరోక్షమగును. **"తన్నివృత్తి మోక్షః"** పరిపూర్ణ పరబ్రహ్మమందు తనకు మూలము లేదనె భావము దృఢమైనచో తానే లేదు తన మనస్సు (ఎరుక - ఆలంబనము) వున్నదా! తన మనస్సు లేకున్న సర్వకర్మలకు మూలమైన సంచిత ప్రారబ్ధ ఆగామి లేకుండ పోవును. మనస్సే సంస్కారములమూట. ఆవిధముగా ఆరూఢ త చెందిన వాడు అశరీరి. మరణ కాల మాసన్నమగు వరకు తన మనస్సు లేకుండా చేసుకొన్నచో చివరకు ప్రాణమొక్కటే ఆకాశము యొక్క ఆకర్షణ చే లాగబడి శరీరము నుండి బయటపడి బ్రహ్మండములోని సమిష్టి ప్రాణములో చేరును. తిరిగి జన్మవచ్చుటకు సంస్కారములతో

కూడిన వ్యష్టి మనస్సు లేదుకనుక తిరిగి పుట్టుక లేకుండ పోవును. జన్మరాహిత్య రూప మోక్షము సిద్ధించును. ఇదే కైవల్యం చెందుట. ఇట్లారుఢత చెందినవాడు సన్యాసి, యోగి అని ఈమంత్రము ప్రబోధించుచున్నది. ఇట్లా రూఢ చెందిన వాడు అచలర్షి మహాత్ముడు.జైజైలు

## సన్న్యాసీచ = సన్న్యాసి

సర్వసంగమును విడినాడిన వాడే సన్యాసి. తన్నుతాను విడిచిన వాడు దేనితో కూడియుండును. అన్నిటిని వదలినవాడు. మూలము లేని ఈ గుర్తెరిగే శరీరమునకు నిరాలంబనమునందు మూలము లేదు స్థానము లేదని ఆరూఢత చెందినవాడే సన్యాసి. అట్టి వానికి సర్వభ్రాంతులు నశించును, సర్వకోరికలు నాశనమగును. అంతః కరణమునందెట్టి కోరికలు జనించిన అతనిని అవిభాధించవు. ఎందుకనగా అతడు కర్తృత్వ రహితముగా పనులు చేయును గనుక చేసియు చేయనివాడేయగును. అప్పుడే అతనికి జన్మరాహిత్యరూప మోక్షము కైవల్యము ప్రాప్తించును. అతడే సన్యాసి, ఇతరులు వేషధారులు.

## యోగీచ = యోగి

యోగమనగా రెండింటి కలియక. పారమార్థికముగా జీవబ్రహ్మైక్యము సాధించుటయే యోగము. ఆకాశము సూక్ష్మము. ఆ ఆకాశము కన్న సూక్ష్మంగా యున్నదే ఆత్మ జ్యోతి. దానిని చూచినవాడే యోగియంటారు. కాని ఆ॥ ఊరకుంట దెలియ ఉత్తమ యోగంబు మానసంబు కలిమి మధ్యమంబు ఆసనాది విధులు అధమ యోగంబురా॥ వి॥ అని వేమన స్పష్టపరిచినారు. అచల పరిపూర్ణ బ్రహ్మమును ఊరకనే యుండి తెలుసుకొనుటయే ఉత్తమ యోగము. మనో సంబంధమైన యోగమువలన మానసిక శక్తులు కలుగజేయు కొన్ని సిద్ధులు కలిగినను అవి అశాశ్వితము. కనుక మనస్సుచే శరీరముచే చేయు యోగములద్వార ఆ నిరాలంబనము తెలియబడదు. అద్దానిని ఊరక ఉండి గురుసూచన ద్వారా తెలుసుకొన్న తెలివి మరిచియుండుటే ఉత్తమ యేగము. అట్టివాడే యోగి అని వేమన ప్రవచించుచున్నాడు. మరొక విధంగా "ఊరకుంట దెలియ" అనగా కర్తృత్వరహిత కర్మాణచరణయే ఉత్తమయోగమని అతడే ఉత్తమ యోగి అని వేమన ప్రభోదించుచున్నాడు.

**"నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతియః"**. ఈ భావమును శ్రీ శివరామ దీక్షితుల వారు తమ బృహద్వాసిష్టమున అఖండానుభవ రహిత ప్రకరణమున పొందు పరిచినారు. **"సర్వకాలం యెరుకకు వెరచి పరిపూర్ణమలంభించితే చాలు వొక్కటే వ్యవహారము. అంతా తానే అంతా తానే, 100 అంతా తానే అని దేహపతన పర్యంతం యీలాగు యుక్తి వుంటే వ్యవహారమునకు పనిలేదు. యిది సిద్ధాంతము, యిదే సత్యం, .యిదే మహారహస్యం, మహా గూఢం యేమిలేదు"**

ఇందు యేమి లేదని యనుటలో పరమార్థమేమనగా సర్వభ్రాంతులకు మూలమైన ఈమూలము లేని గుర్తెరిగే శరీరమునకు (ఆలంబనమునకు) నిరాలంబమునందు స్థానములేదు. మూలము లేదని ఆరూఢత చిక్కిన పిమ్మట నిరాలంబనము వున్నదని గాని, అందు ఆలంబనము లేదని గాని అనుటకూడ యెరుక వాక్యములే. అవియు భ్రాంతి రూపములే. **"కనుక నిర్ణయమే మహాపాపము"** అని దీక్షితుల వారున్ను యేనిర్ణయము

చేయడు నేనని మహాత్ముడెపుడు అని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు సెలవిచ్చియున్నారు. అంతేగాక **"ఇది తప్ప ఏమి లేదని। మొదటిది మొర పెట్టుచుండు ముదమున విను మా। ఖుది ఏమిలేదు పొమ్మని। వదలక రెండోది లెస్స వదురూచుండునురా। బయలెరు కాలనిదినిశ్చియమురా । అదిగాక నీరెంటి నరసి నీవిప్పుడు విదితముగా రెంట్నీ విడరా మంత్రములిట్లు...."** అని సెలవిచ్చి యున్నారు. రెండు మంత్రముల చివర యేమిలేదు అని యేగలదు. ఎరుక వదిలినవానికి ఇంకేమైన వున్నదా! కనుక పరిపూర్ణ మున్నదనిగాని, ఎరుక అందు లేదని గాని జ్ఞప్తిలో లేకుండుటయే పరిపూర్ణ బోధయందు అంతిమ సోపానము.

**ఏషా మజ్ఞాన జన్తూనాం సమస్తా రిష్టశాన్తయె యద్య ద్బోద్ధవ్య మఖిలం తదాశంక్యా . బ్రవీమ్యహమ్ ॥**

సమస్త అరిష్టములు తొలగి పోవుటకు అజ్ఞాన జీవులకు బోధించ వలసిన సర్వస్వమును చెప్పుచున్నాను. పైన జెప్పిన విధముగా నిరాలంబనము నందు మూలము లేని ఈ గుర్తెరిగే శరీరమునకు స్థానములేదు, మూలము లేదని ఆరూఢత జెంది ఆలంబనమున పరిపూర్ణములో తాను వున్నానని భ్రాంతి వదిలినవానికి సమస్త అరిష్టములు తొలగిపోవును. నిరాలంబ దర్శనమే మంగళకరము దాని వల్ల తిరిగి జన్మలేని జన్మరాహిత్య మోక్షము సిద్ధించును. అట్టి వాని జీవితము ధన్యమైనది. ఎందుకనగా సర్వసంస్కారములు, సర్వభ్రాంతులు నశించిన వానికే జన్మరాహిత్య మోక్షము గాని ఇతరులకు ఇది సిద్ధించుదు. అట్టి వానికి సర్వారిష్టములు తొలగిపోవును. కావుననే అజ్ఞానులనగా ఆత్మ జ్ఞానములేని వారికి ఈ సర్వస్వమును అనగా నిరాలంబ బోధామృతమును చెప్పుచున్నానని, మొదటి ఉపనిషద్మంత్రము ప్రభోదించుచున్నది.

**మం శ్లో॥ 1. కిం బ్రహ్మ. 2. క ఈశ్వరః 3. కో జీవః 4. కా ప్రకృతిః 5. క పరమాత్మా 6. కో బ్రహ్మా 7. కో విష్ణుః 8. కో రుద్రః 9. క ఇన్ద్ర 10. క శ్శమనః 11. క సూర్యః 12. క శ్చన్ద్రః 13. కే సురాః 14. కే అసురాః 15. కే పిశాచాః 16. కే మనుష్యాః 17, కా స్త్రియః 17. కే పశ్వాదయః 18. కింస్థావరం 19. కేబ్రాహ్మణాదయః 20. కాజాతిః 21. కిం కర్మ 22. కిమకర్మ, 23. కింజ్ఞానం 25. కిమజ్ఞానం 26. కిం సుఖం 27. కిం దుఃఖం 28. కిం స్వర్గః 29. కోబన్ధః 31. కోమోక్షః 32. క ఉపాస్యః 33. క శిష్యః 34. కో విద్వాన్ 35. కో మూఢః 36. కిమాసురం 37. కింతపః 38. కిం పరమంపదం 39. కిం గ్రాహ్యం 40. కి మగ్రాహ్యం 41. క స్సన్న్యాసీత్యాశంక్యాఽహ కింబ్రహ్మేతి హోవాచ. (2)**

తా॥ 41 ప్రశ్నలు 1. బ్రహ్మము ఏది? 2. ఈశ్వరుడెవడు? 3. జీవుడెవడు? 4. ప్రకృతి యేది? 5. పరమాత్మ ఎవడు? 6. బ్రహ్మ ఎవడు? విష్ణువెవడు? 8. రుద్రుడెవడు? 9. ఇంద్రుడెవడు ? 10. యముడెవడు ? 11. సూర్యుడెవడు 12. చంద్రుడెవడు? 13. సురులెవరు? 14. అసురులెవరు? 15. పిశాచులెవరు? 16. మనుష్య లెవరు? 17. స్త్రీ లెవరు? 18. పశువులెయ్యవి? 19. స్థావరము లెయ్యవి? 22. బ్రహ్మణు లెవ్వరూ? 21. అకర్మ యనగానేది? 24. జ్ఞానమనునది యేది? 25. అజ్ఞానమనయేది? 26. ఏది సుఖము? 27. ఏది దుఃఖము? 28. ఏది స్వర్గము? 29. ఏది నరకము? 30. ఏది

బంధము? 31. ఏది మోక్షము? 32. ఉపాస్యుడెవడు? 33. శిష్యుడెవడు? 34. విద్వాంసుడెవడు? 35. మూఢు డెవడు? 36. అసురమేది? 37. తపస్సనగా నెయ్యది? 38. ఏది పరమ పదము? 39. గ్రహింపదగినదేది ? 40. గ్రహింపదగనిది ఎయ్యది? 41. ఎవడు సన్యాసి?

**మం॥ శ్లో॥ (బ్రహేతిచ) మహదహంకార పృథ్విన్యస్తే జోవాయ్వాకాశా్త్మకత్వేన బృహ ద్రూపేణాణ్ణ కోశేన కర్మ జ్ఞానార్థ రూపతయా భాసమాన మద్వితీయ మఖిలో పాధి వినుర్ముక్తం తత్సకల శక్త్యుప బృంహిత మనాద్యంతం శుద్ధం శివం శాన్తం నిర్గుణ మిత్యాది వాచ్య మనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ. (3)**

తా॥ (అజ్ఞానులకు) మహత్తు, అహంకారము, పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అనునవిగాను, బృహద్రూపమగు అండకోశము గాను, కర్మ జ్ఞాన ఫలమగు బ్రహ్మాదిలోక రూపముగాను తోచుతున్నవి. అద్వితీయ మైనదియు, సకలోపాధి వినుర్ముక్తమైనదియు సర్వశక్తి సంపన్నమైనదియు, ఆద్యంతములు లేనిదియు, శుద్ధమైనదియు, మంగళకరమైనదియును, శాంతమైనదియు నిర్గుణమైనదియు, అనిర్వచనీయ మైనదియునగు చైతన్యమే బ్రహ్మము.

41 ప్రశ్నలలో। ఒకటవదైన కిం = బ్రహ్మ బ్రహ్మమేది? బ్రహ్మము అనే పదము నిరాలంబణ బ్రహ్మమునకు వర్తించునుగాని ఇతరులు దీనిని అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు కూడ వర్తింపచేయుచున్నారు. రెండు బ్రహ్మాలు ఉన్నావా? అంటే ఉన్నవనే చెప్పవలెయును. కావున మొదట పరిపూర్ణ పర బ్రహ్మమును వివరించి తరువాత అదిష్ఠాన బ్రహ్మము (సచ్చిదానందబ్రహ్మము) నకు వివరములు కూర్చబడినవని గమనించగలరు. అనె మొదటి బ్రహ్మము నిరాలంబన బ్రహ్మము, పరిపూర్ణ పరబ్రహ్మమునకేవర్తించును. తక్కిన నలుబై ఎరుక బ్రహ్మము, ఆలంబన బ్రహ్మ, అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు వర్తించును. అజ్ఞానులు నిరాలంబన బ్రహ్మమును చేతన బ్రహ్మకు వర్తింపజేయుదురు. అజ్ఞానులకు నిరాలంబన బ్రహ్మను గూర్చి చెప్పెదనని ఈ ఉపనిషత్కర్త నుడివియున్నాడు. మరొక విషయము యిచ్చట గుర్తింపవలసిన దేమనగా యెరుక బ్రహ్మమునుగూర్చి క్షణ్ణంగా తెలుసుకొన్న తర్వాతనే నిరాలంబన బ్రహ్మము తెలియవచ్చును. శ్లో॥ **"స్వయం బ్రహ్మ మయో భూత్వా తత్పరం చావలోక యేత్। పరాత్పరం తరం నాన్యత్ సర్వగం తన్నిరామయం"** ॥ అని గురుగీత గానం చేసింది. శ్లో॥ 212.

తా॥ జనుడు తానుబ్రహ్మ స్వరూపియై ఆ పిమ్మట దాని కతీతమైన కేవాలాత్మను (నిరాలంబ బ్రహ్మమును) జూచును. అట్టి నిరాలంబము కంటే అన్యమైనదిలేదు. అది అంతట నిండియుండునదియును, నిరామయ మైనదియునైయున్నది. అది దేనికి ఆధారముగాదు. కనుక దేనికి ఆధారముగాని నిరాలంబ బ్రహ్మము (పరిపూర్ణ పరబ్రహ్మమును) గూర్చి తెలుసుకొందాం. బ్రహ్మమనె పదము కేవలం పరిపూర్ణ బ్రహ్మమునకే వర్తించును. అందుకు గాను.

**యత్ వాచా నభ్యుతం యేన వాగభ్యుద్యతే। తదేవ బ్రహ్మత్వం విద్ధిననేదం యదియదిద ముపాసతే॥ కేనోపనిశత్తు 1-5.**

తా॥ ఏది వాక్కు ద్వారా వ్యక్తపరచబడ జాలదో అది మాత్రమే బ్రహ్మమని అనగా పరిపూర్ణ పరబ్రహ్మమని (నిరాలంబమని) నీవు తెలుసుకో. దేనివలన వాక్కు వ్యక్తమగునో, ఇక్కడ ప్రజలు దేనిని ఉపాసించుచున్నారో అది బ్రహ్మముకాదు. కనుక నిరాలంబమే బ్రహ్మము.

**1. బ్రహ్మేతిచ = అదే బ్రహ్మము.**

పరిపూర్ణ పరబ్రహ్మమే (నిరాలంబబ్రహ్మమే) బ్రహ్మము. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి విచారింతము.

**అచల పరిపూర్ణ సిద్ధాంతము.**

అచల పరిపూర్ణ ప్రబోధామృతమను సిద్ధాంతమును ఒక్క మాటతో చెప్పాలంటే, పరిపూర్ణము లేనేరుకను యెరిగి యెరుకను మానుము అని చెప్పవచ్చును. ఈ ఒక్క వాక్యములో పరిపూర్ణమును లేనెరుకను గురుముఖంగా విచారించి తెలుసుకోవడం, తాత్విక పరిశోధనకు సంబంధించినది. తదుపరి ఆరెంటిని ఏ యెరుకచే గ్రహించితివో ఆ యెరుకను వదిలివేయుమని కర్తవ్యోపదేశం చేయబడుతుంది.

నిరాలంబం అనీ, పరిపూర్ణ పరబ్రహ్మమనీ, బయలనీ, ఉత్త బట్టబయలనీ, అచలమని, పరమపదమనీ మొదలగు పేర్లు నిరపేక్షక కేవల బ్రహ్మమునకు వ్యవహారార్థము వాడ బడ్డాయి. దానికే పేరు లేదు - మనమే దానికి పేర్లు పెట్టి నాము. దానికే పేరు పనికిరాదు.

**అచల పరిపూర్ణ ప్రభోధామృతనిశ్చయము. (సిద్ధాంతము)**

**1. ఉన్నది పరిపూర్ణము శాశ్వతమైనది. కేవలం**

**2. లే నెరుక్క లేనే లేనిది, అశాశ్వతము, చలనముగలది.**

**3. నేను లేననుటయే ఎరుకను వదులుట.**

ఇట్లు గురు ముఖంగా యెరిగి కర్తృత్వరహిత కర్మా చరణావిధానమున తనువు విడిచిన నాడే (అహం ను వదిలిన వాడే) వేయించిన విత్తనము మొలకెత్తనట్లు నిర్బీజమై సర్వభ్రాంతి రహితమై జన్మరాహిత్య మోక్షము సిద్ధించును.

**వివరములు 1. పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది.**

1. పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది. కేవలం అనగా తాను తప్ప తదితరమేదియు తనయందుగాని తనకు వేరుగాని యీషణ్మాత్రములేకుండా బాహ్యాంతర భేదమేమి లేకుండ నిండియున్న పరిపూర్ణమునకే చెల్లును. పరిపూర్ణ పరబయలు పుట్టదు, గిట్టదు, దేనిని ముట్టు కోదు, నన్నెరుగదు, ఏ పనులు చేయదు. బయలనిన నిత్యవస్తువు ఒక్క తీరుగనుండును, కండ్లబడనిది. నేను లేనిది, ఉపాధి లేనిది, పలుకులేనిది, అది ఎవరికి తెలియబడనిది. పరిపూర్ణము తనకు తానే స్వత సిద్ధమైయున్నది.

**2. లేనెరుక లేనే లేదు.**

ఎరుకనగా యెరిగెడు తెలివి, జ్ఞానము, కార్యరూపమగు జీవేశ్వర జగత్తు యొక్క సృష్టి స్థితి, లయములకు అత్యంతమూల కారణమైన అధిష్ఠాన చేతనబ్రహ్మమే ఎరుక. సృష్టియందున్న పదార్థములన్నిటికి ఈ ఎరుకే ఆధారము, అధిష్ఠానముగానున్నది. ప్రళయమునందీ జీవేశ్వర జగత్తు బీజరూపము దాల్చి ఈ ఎరుకయందు గర్భీకృతమైయుండి

పునఃసృష్టియందు తిరిగి ఆవిర్భావము చెందుతుంది. సృష్టికి పూర్వమున్న యెరుక సత్తుగానువున్నది అసత్ గాను సదసత్తుగానువుంది. అణువు కంటే చిన్నగా మహత్తుకంటే పెద్దగానువుంది. ఈ ఎరుక పురుష ప్రకృతులుగా, పంచతన్మాత్రలుగా, పంచ భూతములుగా, జీవేశ్వరులుగా, సగుణ నిర్గుణములుగా, సాక్షిగా కర్తగా, భోక్తగా, లోకములుగా లోకేశ్వరులుగా తేజోంధకారములుగా నున్నది యెరుకే. ఇదే ఏకము, అనేకముగా, త్వం, తత్, అసి పదార్థముగానున్నది. సర్వనామ రూప నటనలుగా, ఖండా ఖండములుగా సర్వద్విపుటులు, త్రిపుటులుగా, కార్యకారణముగా నున్నది. ఎరుక నిరంత పరిణామశీలి. ఇట్టి లక్షణములు గల ఎరుకకు పరిపూర్ణ పరబయలందు ఉత్పత్తికి కారణములేదు. మరియు ఎరుకకు ఎరుకే మూలముగాని వేరొకమూలము లేదు. ఎరుకపుట్టనే లేదు. ఈ ఎరుకకు పరిపూర్ణ మందు మూలము లేదు నిలిచేందుకు స్థానము లేదు కనుక దీనికి లేనెరుక యని పేరుపెట్టారు. అంటే పరిపూర్ణమందు ఎరుకకు స్థానము లేదు. ఇది పరిపూర్ణ సిద్ధాంతము.

**3. ఎరుకను వదులుట.**

ఎరుకను వస్తు నిశ్చయముగా అనగా యెరుక యొక్క స్థాన స్వరూప స్వభావములు గురుముఖంగా తెలుసుకొని తాను ఎరుక స్వరూపుడని తెలుసుకొని, అపుడు తనకన్యముగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమందు తనకు మూలంగాని స్థానం గాని లేదని ఆరూఢ స్థితి నొందిన వాడే యెరుకను విడిచినాడు.

దేని నైనను పూర్తిగా యెరుగవలెనన్న తన మనస్సు ఆ వస్తురూపము దాల్చవలెను. అప్పుడు ఆ వస్తువు అపరోక్ష మైనట్లు. అపుడు తెలివిచే తెలియదగినయితర మేమి లేదు. అపుడు సర్వము తానై నిలిచిన తాను, తనకన్యంగా పరిపూర్ణము మాత్రమే వుంటాయి. పరిపూర్ణ మందు తనకు మూలం లేదనె విషయము ఇచటనే ఆరూఢమగును. పరిపూర్ణమును గట్టిగా వుండ జూచుకొనె స్థితిన్ని ఇదే. అపుడు గురుడు ఎరుకను నిల్పకుమని చెప్పిన మాటలను పాటించి పాలించుటయే. జ్ఞాన జ్ఞేయ రూపముగానున్న తన స్వరూపము కంటే అన్యంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మము నందు తనకు మూలం లేదని, స్థానం లేదని తెలిసికొని తానే బ్రహ్మననే భ్రాంతిని వదులుటయే ఎరుకు వదులుట.

పరిపూర్ణము పుట్టలేదు. ఎవరిని పుట్టించదు. అందు ఎవరు పుట్టలేదు. కనుక నేను అందు పుట్టలేదు. కనుక నేను పరిపూర్ణమందు లేను.

ఎరుక ఎరుక యందు సత్యమే. ఎరుక యందు పుట్టి సకల వ్యవహారములు కర్తృత్వ రహితముగా చేయుచున్నాను. కనుక నేను ఎరుక యందున్నాను.

ఇట్లు నేను ఎరుక యందున్నాను పరిపూర్ణమందు లేననే ధృడ భావముతో నున్నాను. **కనుక నేను వుండి లేని వాణ్ణి అయినాను**. ఎరుకను కలబాసిన మనుజుడు కూడ కలలోపల పనులు చేయుచునే యుండును. ఎట్లనగా కర్తృత్వరహిత కర్మాంచరణముగా జేయును. అట్టి కర్మ ఆగామి రూపముగా ఎట్టి అదృష్ట ఫలము సృష్టించదు.

ఈ విధముగా పరిపూర్ణమును, లేనెరుకను యెరిగి ఎరుకను విడిచిన వాడు వేయించిన విత్తనము మొలకెత్తనట్లు తిరిగి పుట్టడు. ఇదే జన్మ రాహిత్య మోక్షము. ఈ

బోధవల్ల ఫలమని, దీనిని అంతా అజ్ఞానులకు యెరిగింతునని ఈ ఉపనిషద్కర్త ఈ మంత్రమున వాగ్దానము జేసియున్నాడు. జనులందరు ఇట్టి పరిపూర్ణబోధ వడసి తరించగలరని ఆశిస్తున్నాను.

ఇక ఈ మంత్రము 2నుండి 41 వరకు గల వాటి నొక్కొక్కదానిని పరిశీలింతము.

**1. బ్రహ్మేతిచ = 2 ఎరుక బ్రహ్మము**

కేవలం బ్రహ్మ తాను తాను గానున్నప్పుడు అనగా సృష్టి కామన కలుగకముందు జ్ఞానరూపంగా నున్నప్పుడు అహంవృత్తి లేనప్పుడు పరబ్రహ్మము.

శ్లో॥ బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్తు, మహత్తో మదాహంకారః మదాహంకారాత పంచతనాత్మత్రాణి, పంచతన్మాత్రే భ్యో పంచభూతాని, పంచ భూతేభ్యో అఖిలం జగత్.

**అవ్యక్తము:** బ్రహ్మము జ్ఞానా జ్ఞానములను రెండు గుణములు కలిగినపుడు అవ్యక్తము. అవ్యక్తముయొక్క పరిణామము మహత్తు.

**మహత్తు:** త్రిగుణాత్మక శక్తి విజృంభించినపుడు సృష్టియంతయు జరుగును. మహత్తుయొక్క పరిణామము మహదాహంకారము.

**మదాహంకారము:** సమస్త సృష్టి తానేనని అభిమానించినపుడు మదాహం కారము. దీని యొక్క పరిణామము పంచతన్మాత్రలు.

**పంచతన్మాత్రలు:** సృష్టిలో కలుగు సుఖ దుఃఖములను చూచి తాను అవి ఒక లీలగా భావించి ఆనందించినపుడు ఏక రూపమందు బ్రహ్మకు వివిధ దశలలో నామములు కలుగుట మాత్రమేనని తెలియవలయును. వీటి పరిణామమే పంచభూతములు.

**పంచ భూతములు:** తమోగుణప్రధానమగు మూలమాయతో కూడి ఈశ్వరుని నుండి పంచ భూతములు ప్రకృతి కలిగెను. అవే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి. పంచ భూతముల పరిణామమే జగత్తు. దీని పరిణామమే విరాట్టు.

**బృహద్రూపేణాణ్ణకోశేన.**

అధిష్టాన చేతనబ్రహ్మము అండకోశముగానున్నది. బృహద్రూపముగా బ్రహ్మమున్నదంటే పెద్దదిగానున్నది. దాని కంటే మరొక పెద్ద వస్తువులేదు. 'బృంహివృద్ధౌ అనుధాతువు నుండి వర్తించినది. **బ్రహ్మబృంహణాత్ బృహతి వర్ధతే"** అని శబ్ద కల్ప ధృవము నిర్వచించినది. ఇదే భూమా పదార్థము. గురు స్వరూపము. సమస్త సృష్టి ఈ బ్రహ్మము నుండే వెలువడుతున్నది. శ్రుతి **" యతోవా యిమాని భూతాని జాయంతి ఏన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసం విశంతి, తద్వి జిజ్ఞాసస్య తద్బ్రహ్మేతి॥"** తైతిరేయోపనిషత్తు.

తా॥ దేని యందు భూతములు పుట్టుచున్నవో, పుట్టినవి దేనిచేత బ్రతుకుచున్నవో, తిరిగి మరణానంతరము దేని యందు ప్రవేశించుచున్నవో అదియే బ్రహ్మము. సృష్టి కారణమగు బ్రహ్మము. దీనిని గురించే జిజ్ఞాస గావించుము అనగా విచారణ చేయుము. కావున ఈ సృష్టికారణబ్రహ్మమే (ఎరుక) అండకోశముగా నున్నది.

**"కర్మ జ్ఞానార్థ రూపతయా భాసమాన మద్వితీయ మఖిలోపాధి వినుర్ముక్తం తత్సకల శక్త్యుప బృహిత మనాద్యంతం శుద్ధం శివం శాన్తం నిర్గుణ మిత్యాది మాచ్య మనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ - 3"** అనగా ఈ బ్రహ్మము కర్మ జ్ఞాన ఫలమగు బ్రహ్మాది

లోకరూపముగా తోచుచున్నది. కర్మ జ్ఞాన ఫలమే బ్రహ్మాది లోకరూపముగా నున్నది. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు దీనినే హృదయ గ్రంధియన్నారు. హృదయ గ్రంధి యనగాముడి. ఒకే వస్తువు తనను రెండు రూపములుగా కర్మ జ్ఞానములుగా గానవచ్చు వస్తువు కూడా ఆ రెండు రూపములుగా ముడిపడి విడదీయరాక యున్నవి.

జ్ఞానేంద్రియముల ద్వారా మానవుడు విషయేంద్రియముల ద్వారా కర్మ చేయుచున్నాడు. జ్ఞానము ననుసరించి కర్మ, కర్మననుసరించి జ్ఞానమున్నాయి. జ్ఞానములేక కర్మలేదు, కర్మలేక జ్ఞానము లేదు. ఈ రెంటి వల్లనే విశ్వమేర్పడినది. ఈ జ్ఞాన కర్మలున్నంతవరకు చావుపుట్టుకలు తప్పవు. క.ప.67 **ముడిపడి కర్మము జ్ఞానము ! విడువక నా రెండు వెలసె । విశ్వమన నదే....."** 17తత్వములతో కూడిన శరీరమే హృదయగ్రంధి. కర్మ జ్ఞానముల యొక్క చేరిక విడువక ప్రహించును. విశ్వమన అదే పద్ధతిగా ప్రవహించును. క.ద. 312 **"హృదయ గ్రంధి విడుటకై సదయుత యాబోధ దెల్ప జనదా గురుడై"** ఈ హృదయగ్రంధి విడుటకై శిష్యుడు గురుని చేరవలయును. ఇది అచల గురుకృపచే మాత్రమే ఛేదించబడును. గురుకృపవల్ల నిరాలంబ బ్రహ్మము యొక్క దర్శన భాగ్యము కలుగును. అందువలన నిరాలంబమున ఆలంబనమునకు (ఎరుకకు) మూలములేదని నిశ్చయమైన తనతోపాటు ఈ విశ్వము లేకుండాపోవును. అప్పుడు నీవులేక చేసిన జ్ఞాన కర్మ ఫలము అంటదు. అప్పుడే జన్మరాహిత్య మోక్షము సిద్ధించును.

**అద్వితీయ ముఖిలో పాధి వినుర్ముక్తం.**

బ్రహ్మము అద్వితీయమైనది. అద్వైతవాదులు వివర్త వాదము ప్రతిపాదించి బ్రహ్మమునందెట్టి మార్పు జరుగకుండనే మాయా పరిణామము వల్లనే అన్య ప్రతీతి కలిగెనని, లేని మాయనే పరిణమించిన దని జెప్పెదురు. ఉన్న బ్రహ్మము యెప్పటివలెనే ఏ మార్పు చెందకుండాయున్నది. కనుక అది ఏక మాత్రమని మాయాకార్యములున్నట్లు తోచిన అవి మిధ్యయే కనుక బ్రహ్మమొక్కటి యే తప్ప అన్యము లేదని " ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ అనే" శ్రుతికి అర్థము గ్రహించిరి. నిత్యమై శుద్ధమై ఆది మధ్యాంత రహితమై అద్వయమై, నిష్క్రియమై నిర్గుణమై స్వయంప్రకాశమై, సర్వకారణమై సర్వమునకు ఆధారము అధిష్ఠానమై సచ్చిదానంద లక్షణములు గలదై మనోవాగ గోచరమై యుండునదే బ్రహ్మము. ఇది స్వరూప లక్షణము. అనగా సహజలక్షణము. మొదటి రూపము. ఈస్వరూపము గలదొక్క బ్రహ్మమే కనుక ఏకమేవా అన్నారు. దానికి మరొకటి సాటి లేదని అద్వితీయం అన్నారు. కనుక సకలోపాధి వినుర్ముక్తమైయున్నది. మాయా బ్రహ్మములు రెండు ఒకటే, బ్రహ్మశక్తిచే గాని సకలము సృష్టించబడినది. అద్వితీయమైనది కేవలం నిరాలంబము మాత్రమేనని గ్రహించవలయును.

**తత్సకల శక్త్యుప బృంహిత మనాద్యంతం.**

బ్రహ్మము సర్వ శక్తితో కూడుకొని యున్నది. ఈ అనంత విశ్వము తన సర్వశక్తులతో ఇంత సౌష్టముగా నడుపుచున్నాడు. **"యయేకోజాలవాన్ ఈ శతఈశనీభిఃసర్వాన్ లోకానీశతయీాశ నీభీః, యఏవైక ఉద్భవే సంభవేచ, యయే తద్విదు రమృతాస్తే భవన్తి"** - శ్వేత. తా॥ ఆ బ్రహ్మమే తనశక్తులచే సర్వమును నియ మించుచున్నాడు. సృష్టి స్థితి లయములు జేయుచున్నాడు. "భీషాస్మాద్వాతఃపవతి, భీషోదేతి సూర్యః, భీషాస్మా

దిం(దశ్చాగ్నిశ్చ, మృత్యుర్ధావతి పంచమః" సూర్యాగ్ని యింద్ర వాయు మృత్యువులు భయము చే అతని ఆజ్ఞకు లోబడి వర్తించుచున్నాయి. ఇట్లు సర్వనియంతగా వర్తించు చుండియు, "తస్యకర్తారమపి విద్య కర్తారమవ్యయం" గీత అన్నిటి కర్త అయ్యి అకర్తగా అనగా కేవల సాక్షిగా కూడా ఆ బ్రహ్మమే యుంటూవున్నది.

## అనాద్యంతం.

ఈ బ్రహ్మమునకు ఆద్యంతములు లేవని ఇచట చెప్పబడినది. ఆది అనగా మొదటిదని కార్యబ్రహ్మమని అర్థము. కొలతలకు లోబడుదానికి ఆది మధ్య అంతము లుండును. గురు స్వరూపమనగా గొప్పలేక పెద్ద స్వరూపము బ్రహ్మ స్వరూపము. గొప్ప పెద్ద అను పదములు సాపేక్షక శబ్దములు. అవి చిన్న పెద్ద కురుచపదములను పురస్కరించుకొనియే వర్తిల్లును. "**అణోరణీయాన్, మహతో మహీయాన్**" అని చెప్పబడే ఆత్మ స్వరూపము ఎంత మహత్ప్రమాణమైన అదియు నొక ప్రమాణము కలిగియున్నది. అది అంతట నింతట గలదే గాని అంతట ఏక రీతిగా లేదు. ఎంత పెద్ద ఆవరణమైన దానికి మితి అంటూవున్నది. **"మీయతే అనీనమాయ"** మితిలో గలది మాయ. మాయా బ్రహ్మలు విడదీయ రానివిగానున్నవి. కనుక ఆదిమధ్యాంత రహితము ఎరుక బ్రహ్మముగాదు. నిరాలంబన బ్రహ్మమే అనాద్యంతముయని యెరుగవలయును.

## శుద్ధం

ఈ బ్రహ్మము శుద్ధమైనది. అనగా తెల్లనిది దోషరహితమైనదని అర్థములుగలవు. సూర్యుని కిరణములందు సప్తవర్ణములున్నను తెల్లగా కన్పించునట్లు గురు పరమాత్మయొక్క స్వరూపము శుద్ధమైనదని వర్ణించినా సప్తవర్ణాత్మక ప్రపంచమును ఆబ్రహ్మము బీజరూపముగా ధరించియున్నది. అట్లే దానియందు ఏదోషములు లేకున్నను ఉపాధులు పొందే దోషమున్నది. దోష రహితమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. అది "నిర్దోషంహి సమంబ్రహ్మ" అని చెప్పినపుడు కేవలదోషరహితమైనది నిరాలంబం అని చెప్పవలయును.

## శివం

శివమును గూర్చి భ్రాంతి రహిత శ్లోకము యిట్లు చెప్పచున్నది. శ్లో॥ ఇన్ద్ర జాలమిదం సర్వం యధామరు మరీచికా। అఖండిత మనాకారం కేవలం వర్తతేశివం.

తా॥ ఈ దృశ్యమంతయు ఇంద్రజాలము వలెతోచువస్తు సముదాయమువంటిదే. ఎండమావులలో జలమువలె భ్రాంతిని గొలుపుచున్నది. నిజముగానున్నది శివయొక్కటే. అదే నిరాలంబం. అది అఖండం మరియు కేవలం. శివ మనుటలో అది సర్వశుభప్రదమైనది, మంగళప్రదమైనది. శాశ్వత జనన మరణ రాహిత్యము సిద్ధించుట కన్న శుభము మంగళప్రదమైనది మరొకటి లేదు. కాని ఈ మంత్రమునందు శివంనకు నిరాలంబం అర్థమునే గ్రహించ వలయునుగాని ఆలంబన బ్రహ్మము ఎరుక బ్రహ్మముగా గ్రహించరాదు.

## శాన్తం.

ఆలంబన బ్రహ్మము (సచ్చిదానందబ్రహ్మము) శాంత స్వరూప మైనది. అంతః కరణ వృత్తులు ఉపశమనముపొందిన స్థితి – అంతఃకరణము యొక్క స్థూలధర్మములగు

క్రామ క్రోధాదులు లేకుండుట కాదు. సృష్టి కారణమైన బ్రహ్మము సృష్టికి పూర్వము తాను తానై స్థితిలో (పరబ్రహ్మస్థితిలో) యున్నప్పుడు చలనము లేకుండా యుండెను. అప్పుడు త్రిగుణములు కార్యరూపము వహించని స్థితి అగుటచే వ్యష్టి సమిష్టి అంతః కరణముగాని వాని వృత్తులుగాని లేవు. ఆస్థితిలో మాత్రమే పరమాత్మ శాంత స్వరూపుడు. ఆ బ్రహ్మకు అహంస్ఫురణ కలిగి నేను అనేకమగుదుగాక! అను సంకల్ప రూప ప్రథమ చలనము కలిగిన వెంటనే త్రిగుణ విజృంభణమై గుణ సృష్టికి కర్తృత్వ భోక్తృత్వములు కలుగుచున్నవి. సుషుప్త్యావస్థలో మాత్రము నిర్గుణము నిర్మలము శాంతము అయివున్నది. అందుకే బ్రహ్మ స్వరూపము శుద్దేసుషుప్తి అని దృష్టాంత మీయ బడినది. అయినను జీవేశ్వర జగత్తుగా పరిణామము జెందినపుడు ఆ బ్రహ్మము మరల అశాంతిలోకి మార్పు చెందుచున్నది. కనుక నిర్గుణముగా, నిర్మలంగా, శాంతముగా నున్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. నిరాలంబనమే. అంతఃకరణ వృత్తులు ఉపశమనం పొందిన స్థితియే అశరీరస్థితి. అప్పుడే మహాశాంతం.

**నిర్గుణ మిత్యాది మనిర్వాచ్యచైతన్య బ్రహ్మ.**

ఆలంబన బ్రహ్మము నిర్గుణమని, అనిర్వచనీయ మని ఈ మంత్రమున కొనియాడబడినది. కాని అది సరిగాదు. కేవలం నిరాలంబన బ్రహ్మమే నిర్గుణమైనది. అనిర్వచీయమైనది. చైతన్య బ్రహ్మమునందు త్రిగుణముల సత్వరజోతమో గుణములు గలవు. ఇవి దానిలో గర్భీకృతమైయున్నవి. సూక్ష్మంగా బీజరూపములోనున్నవని చెప్పవలసినదే. కారణమందు త్రిగుణములుండుట చేతనే కార్యరూపమైన జీవేశ్వర జగత్తునందు ప్రకటితమైనవి. త్రిగుణములు లేశమైనలేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అదే నిరాలంబం.

సచ్చిదానంద బ్రహ్మము అనిర్వచనీయమని ఈ శ్లోకమున జెప్పబడినది. చైతన్యమనగా కదలిక. కదిలికకు కారణమైనది ఆత్మనే క.దం.52. **"ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే । ఆటాడు ఎరుక యనియెడి। ఆటాడించేటివాడు అతడేరా కర్త। అంతటికి యీా అచల మకర్తా ...."** ఎరుకయగు పురుషుడు ఆటాడును. ఆడకుండాయుండును. మరియు శరీరముతో ఆడకుండా తనలో తానే ఆడుచుండును. కనుక ఆటాడించెడివాడు ఎరుకపురుషుడే కర్తయని నిర్ణయము. పరిపూర్ణపరబాహ్యాము (నిరాలంబం) ఆడదు, ఆడించదు, **"నిశ్శక్తి నిర్మలం నిష్క్రియంబ్రహ్మ"** కనుక పరబాహ్యాము అకర్త. జ్ఞానము, ప్రాణము, శక్తి కదలిక యనువాని అన్నిటికి మూల కారణముగా నున్నదే అధిష్ఠాన బ్రహ్మము. దీనిని అనిర్వచనీయ బ్రహ్మమనుట సబబుగాదు. **"ఆత్మవా2 రేద్రష్టవ్యశోతవ్య మంతవ్యోనిధి ధ్యాసితవ్యః"** బృహదారణ్యకోపనిషత్తు ఆత్మ యేచూడదగినదని, వినదగినది మననము చేయదగినది, ధ్యానముచే పొంద దగినది అనగా మనస్సుచే పొందదగినదిగానున్నదని. బృహదారణ్య కోపనిషత్తు ఆత్మను నిర్వచించినది. అట్లు నిర్వచించ బడిన చైతన్యమే పరబ్రహ్మము. కాని **"తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే"** కేనోపనిషత్తు 1.5.9 ఏది ఉపాసితవ్యము. అనగా ఉపాసించుటకు సాధ్యమగునది కాదో, దానిని బ్రహ్మముగా తెలుకొమ్ము. అదే పరిపూర్ణ పరబ్రహ్మము(నిరాలంబం). ఎందుకనగా ఉపాస్య ఉపాసకోపాసనలను త్రిపుటి

కందుస్థానములేదు. క.ద.॥34. **పలుకున పలుగరాకను౹ తలపోయిదమనిన మదికి దగులకయెపుడున్౹ ములుగృచ్ఛ సంధి లేకను౹ కలిగున్నది బట్టబయలు....**" అని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారున్ను, "**యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహా**" తైత్తరయోపనిషత్తు జెప్పినది. తా॥ మనస్సును వాక్కున్ను దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది నిరాలంబం. ఏమనుటకు, పలుకుటకు వీలు లేదు గనుక నిరాలంబ బ్రహ్మమే అనిర్వచనీయమైనది.

**మం. శ్లో॥ ఈశ్వర ఇతిచ బ్రహ్మైవ స్వశక్తి ప్రకత్యా ఽ భిధేయ మాశ్రిత్య లోకాన్ సృష్ట్వాప్రవిశ్యా ఽ న్తర్యామి త్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియన్తృత్వాదీశ్వరః, జీవఇతిచ, జీవం ఇతిచ బ్రహ్మవిష్ణీశానేం ద్రాదీ నాం నామరూప ద్వారా స్థూలోహ మిత్యధ్యాసవ శాజ్జీవః, సో హ మేకోఽ పి దేహారమ్భక భేదవశా ద్బహు జీవః - 4.**

తా॥ ఈశ్వరుడనగా బ్రహ్మమువలననే సర్వశక్తి నాశ్రయించి ఈశ్వత్వముపొంది తన్నెరుంగని వారిచేత తనకంటే వేరుగా నున్నట్లు ఈ కనిపించు లోకమును సృజించి ఆలోకముల యందు తానే అంతర్యామిగా ప్రవేశించి బ్రహ్మనుండి అల్పజీవి వరకు సర్వజీవుల యొక్క బుద్ధీంద్రియములకు నియంత అగుటవలన ఈశ్వరుడనబడు చున్నాడు.

జీవుడనగా ఈశ్వరుడే. బ్రహ్మ, విష్ణు ఈశానుడు, ఇంద్రుడు మొదలగు వారికి నామ రూపముల ద్వారమున నిచ్చిన (మిధ్యయగు) అధ్యాస వలన సర్వస్థూల శరీరములను అభిమానించువాడగు సమిష్టి జీవుడగుచున్నాడు. ఆ సమిష్టి జీవుడు ఒకడే అయినను, వ్యష్టిదేహముల నభిమానించుటకు కారణమగు తూలాంతః కరణ భేదమునకు వశపడుటవలన అసంఖ్యాకమగు జీవికోటియగుచున్నాడు.

**ఈశ్వర ఇతిచ** = ఈశ్వరుడనగా వాయువు యొక్క సూక్ష్మాంశమే స్పర్శ, స్పర్శ సూక్ష్మాంశమే ఆదిశక్తి, ఆదిశక్తి సూక్షాంశమే యం బీజము, యం బీజము సూక్ష్మాంశమే ఈశ్వరుడు. ఈశ్వరుడు శబ్ద, స్పర్శ యనెడు రెండు గుణములు గలిగిన వాయువు చేత జీవులకు భ్రమనం, భ్రాంతిని కలుగజేయుచున్నాడు. తురీయమందు జీవులకు మాయను గల్పించుచున్నాడు.

సమిష్టి అజ్ఞాన స్వరూపమై సత్వగుణప్రధానమైయుండు మాయ యందలి చిదాభాసమును, మాయా సహిత చైతన్యమును గూడి ఈశ్వరుడనబడును. సత్వగుణ స్వరూపమై యున్న ఈశ్వరోపాధియగు మాయ యందు ఆవరణ విక్షేపములు ప్రబలమై యుండనందున ఈశ్వరుడు సర్వజ్ఞుడును, స్వతంత్రుడును, నిత్యముక్తుడును అయివున్నాడు.

**3. జీవ ఇతిచ = జీవుడనగా**

అజ్ఞానము వ్యష్టి సమిష్టి రూపములుగానున్నది. అజ్ఞానము యొక్క అంశమునకు వ్యష్టి అజ్ఞానమనిపేరు. సంపూర్ణ అజ్ఞానమునకు సమిష్టి అజ్ఞానమని పేరు. అజ్ఞానము యొక్క వ్యష్టి రూపమైన మలిన సత్వము నందున్న చేతనా భావమున్నూ ఆ యజ్ఞానాంశమునకు అధిష్టానమైన కూటస్థునికిన్ని బ్రహ్మకున్ను కించిన్మాత్రమగు భేదము మాత్రమే. తాను ప్రత్యగాత్మనను జ్ఞానము లేక పోవుటచేతను తన కుపాధియగు సంస్కృతి యజ్ఞానము నందు తాదాత్మ్య బుద్ధి చేత జీపుడు బద్ధుడై సంస్కృతి పొందుచున్నాడు.

జీవుడనగా ధాతు వ్యుత్పత్తిని బట్టి ప్రాణాధారమని అర్థము. పరమాత్మ యొక్క చలనశక్త్యాత్మకమగు ప్రాణ సంహితుడై యుండుటవలన జీవశబ్దముచే వ్యవహారము వర్తిల్లినది.

సృష్టి కృతకము, అనాది. కనుక అనాది నుండి సృష్టిలోని జీవులు తమతమ పూర్వజన్మ సంస్కారముల ఫలము వల్ల ఆగమన తిరో గమనము చేయుటవల్ల అసంఖ్యాక జీవ కోటి జనన మరణములు పొందుచున్నారు.

**మం॥ శ్లో॥ ప్రకృతి రితిచ, బ్రహ్మణ స్సకాశా న్నానా విచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యక బుద్ధిరూప బ్రహ్మశక్తి రేవ ప్రకృతిః, పరమా ఽ త్మేతిచ, దేహాదేః పరతత్వాత్, బ్రహ్మైవ పరమా ఽ త్మ స బ్రహ్మా సవిష్ణు, స్స రుద్ర, స్స ఇన్ద్ర స్సశమన, స్స సూర్య, స్స చంద్ర స్తె సురా స్తె అసురా స్తే పిశాచా స్తే మనుష్యా స్తా స్త్రియ స్తే పశ్వాదయ స్తత్ సావరం తే బ్రహ్మణాదయ సర్వఖల్విదం బ్రహ్మ, నేహనానాస్తి కిఞ్చన (5)**

తా॥ ప్రకృతి అనగా బ్రహ్మనుండి నానావిచిత్ర జగన్నిర్మాణ సమర్థమగు బుద్ధి రూప బ్రహ్మశక్తి, బ్రహ్మశక్తియే ప్రకృతి. పరమాత్మ ఎవడు? శరీరాదులకంటే పరతరుడగుట వలన బ్రహ్మమే పరమాత్మ. బ్రహ్మఎవడు? ఎవరు బ్రాహ్మణాదులు? ఆబ్రహ్మమే చతుర్ముఖుడగు బ్రహ్మ, అతడే విష్ణువు. అతడే రుద్రుడు, అతడే యింద్రుడు అతడే యముడు అతడే సూర్యుడు, అతడే చంద్రుడు, వారే సురులు, వారే అసురులు, వారే పిశాచములు, వారే మనుష్యులు, వారే స్త్రీలు అతడే పశ్వాదులు. అదియే స్థావరం, వారే (అతడే) బ్రహ్మణాదులు, ఈ సర్వస్వము బ్రహ్మమే, నేను తప్ప మరొకటి లేదు. ఇందు బ్రహ్మదేవుడు మొదలు బ్రహ్మణాంతమగు భేదము కొంచమునులేదు. అంతా బ్రహ్మమే. నాకంటే మరొకటిలేదు.

**4. ప్రకృతి రితచ = ప్రకృతి అనగా**

బ్రహ్మ నుండి నానా విచిత్ర జగన్నిర్మాణ సమర్థమగు బుద్ధిరూప బ్రహ్మశక్తి. బ్రహ్మ శక్తియే ప్రకృతి.

సృష్టికి అత్యంతమూల కారణము బ్రహ్మమే. అట్టి బ్రహ్మము తాను తానై నిస్సంకల్ప స్థితిలో నున్నప్పుడు సృష్టి లేదు. తన యందు బీజరూపముగా అణగియున్న గుణత్రయములు అనగా సత్వరజోతమోగుణముల సామ్యావస్థయే ప్రకృతి. మాయనే ప్రకృతి అందురు. **"కలతేపు ప్రకృతి"** సృష్టికి పూర్వమున్నది. కనుక దీనినే ప్రకృతి అనిరి. ప్రకృతి అనుశబ్దమునకు స్వభావము, స్వలక్షణము, నైజము అను అర్థములున్నవి. ఉత్పత్తిగాని, ఉత్పత్తి హేతువుగాని లేనందున తన నైజలక్షణము చేతను యున్నది గనుక దీనినే ప్రకృతియని యనిరి.

**5. పరమా త్మేతిచ = పరమాత్మ** అనగా శరీరాదుల కంటే పరతరుడగుటవలన బ్రహ్మమే పరమాత్మ. 'తత్వమసి' మహావాక్యము నందలి తత్‌పదమునకు లక్ష్యార్థమై సృష్టి పూర్వం తాను తానుగానున్న స్థితి యందున్న బ్రహ్మ పదార్థమే పరమాత్మ. పరము అనగా ఉత్కృష్టమైనది. పరమాత్మయనగా శ్రేష్ఠమైన ఆత్మ. ఈ పరమాత్మ ఉపాధి గతమై విలక్షణముగా అంతఃకరణకు వుపహితమై యున్నప్పుడు ప్రత్యగాత్మ యనియు, అంతః

కరణ విశిష్టమై యున్నప్పుడు జీవాత్మయనియు నామ రూపాత్మకమగు జీనేశ్వర జగత్తుగా పరిణమించి అందు అనుప్రవేశముగావించి యున్నప్పుడు విశ్వాత్మ యనియు పేర్లు పెట్టబడినది. ఉపాధి సంబంధము వదిలినచో యిది పరమాత్మకంటే భిన్నంకాదన్నమాట. సృష్టికి పూర్వమున్న స్వయం ప్రకాశమైన బ్రహ్మమే ఉత్కృష్టమగు ఆత్మ లేక పరమాత్మ. అది "స్వేమహిమ్నిప్రతిష్ఠితః" అది తన యొక్క మహిమచేతనే, స్వయంభూవై తనయొక్క మహిమ యందే సుప్రతిష్టతమై యున్నది. అది పరమాత్మయని కొనియాడ బడుచున్నది.

బ్రహ్మైవ పరమాత్మ = బ్రహ్మమే పరమాత్మ.

**6.** స బ్రహ్మ = అతడు బ్రహ్మ ఇచట సచ్చిదానంద స్వరూపుడగు ఎరుక బ్రహ్మమే బ్రహ్మము. సృష్టికర్తయే బ్రహ్మము. అధిష్ఠానచేతన బ్రహ్మము.

**యతోవాయిమాని భూతాని జాయంతి, ఏనజాతాని జీవంతి యత్ర్పయంత్యభి సంవిశంతి, తద్విజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" - తైత్తిరీయోపనిషత్తు.**

తా॥ దేవ మానవ పశుపక్షిక్రిమి కీటాకాదులు, సకల చరాచర జంతువులున్ను, అకాశాది పంచభూతములున్నూ దేని యందుండి పుట్టు చున్నవో, దేని సత్తామాత్రముచేత జీవించుచున్నవో, మరల మహాప్రళయమున సకలముదేనియందు ప్రవేశించి లయించునో, ఆవస్తువే బ్రహ్మమనబడును.

పృథ్వి సూక్ష్మాంశమే గంధం, గంధం సూక్ష్మాంశమే క్రియా శక్తి, క్రియా శక్తి సూక్ష్మాంశమే లంబీజం, లంబీజం సూక్ష్మాంశమే బ్రహ్మ, బ్రహ్మ శబ్ద స్పర్శ రూప రస గంధమనెడు ఐదు గుణములు కలిగి పృథ్వి చేత స్థావరజంగమాది రూపము గల ప్రపంచమును సృష్టించినాడు. జీవులకు సుఖదుఃఖములు కలుగజేయుచున్నాడు.

బ్రహ్మణాదులు: బ్రహ్మమొదలగువారు. ఆ బ్రహ్మమే చతుర్ముఖుడగు బ్రహ్మ. బ్రహ్మయనగా నాలుగుముఖములు గల బ్రహ్మ, సృష్టికర్త. పైన గల వివరములు చూడగలరు.

బ్రహ్మణాదులు ఎవరనగా:

**7. స విష్ణువు=అతడే విష్ణువు.**

జలం యొక్క సూక్ష్మాంశమే రసం, రసం సూక్ష్మాంశమే ఇచ్ఛాశక్తి, ఇచ్ఛాశక్తి సూక్ష్మాంశమే వంబీజము, వంబీజము సూక్ష్మాంశమే విష్ణువు విష్ణువు శబ్ద స్పర్శ రూప రసమనెడు నాల్గు గుణములు గలిగిన జలముచేత సర్వ ప్రాణులను కాపాడుచున్నాడు. స్వప్నమందు విష్ణువు జీవులకు లీల వినోదములు గలిగించుచున్నాడు. ఆ బ్రహ్మమే విష్ణువు.

**8. స్స రుద్ర = అతడే (ఆ బ్రహ్మమే) రుద్రుడు**

రోద యంత్య సురానితి రుద్రాః దుష్టులను దుఃఖింపజేయువాడు రుద్రుడు.

అగ్ని యొక్క సూక్ష్మాంశమే రూపము. రూపము యొక్క సూక్ష్మాంశమే జ్ఞానశక్తి. జ్ఞానశక్తి సూక్ష్మాంశమే రంబీజము. రం బీజ సూక్ష్మాంశమే రుద్రుడు. రుద్రుడు శబ్ద స్పర్శ రూపమనెడు మూడు గుణములు గలిగి అగ్ని చేత సర్వమును సంహరించుచున్నాడు. సుషుప్తియందు జీవులకు సర్వ శూన్యమును కలుగజేసి జీవుని ప్రత్యేకపరుచుచున్నాడు.

**9. స్స ఇన్ద్ర = అతడే (ఆబ్రహ్మమే) ఇంద్రుడు.**

ఇదంతీ తీంద్రః అనగా ఇంద్రుడు పరమైశ్వర్య యుక్తుడు. పురుప్రభూతం హూతం యజ్ఞేష్వాహ్వానం యస్యసః పురుహూతః అనగా యజ్ఞములందు ప్రచురమైన పిలుపుగలవాడు. దేవతలకు, దేవలోకమునకు రాజు ఇతని ఆజ్ఞకు వాయువు, అగ్ని, వరుణాది దేవతలు లోబడి పనిచేయుదురు. అంటే వారిలోని శక్తి రూపము బ్రహ్మమే.

**10. స్స శమనః = అతడే (బ్రహ్మమే) యముడు.**

యమనాత్ యమాః ప్రజాసంయ మోద్యమాః మృత్యు ప్రభృతయోఽ స్య కింకరాః – యము ఉపరమేతేషు రాజత ఇతియమరాట్ – ఇతని కింకరులైన మృత్యువు మొదలైన వారు ప్రజలనియమించువారు గనుక యములనం బదుదురు. వారికి రాజుయమధర్మరాజు. యమలోకాధిపతి. అతనిలోని శక్తియే బ్రహ్మము.

**11. స్స సూర్య = అతడే (ఆబ్రహ్మమే) సూర్యుడు.**

సుపతిప్రేరయతి వ్యాపారేష్వతి సూర్యః వ్యాపారులందు ప్రేరేపించువాడు. దినకరుడు. సకల జీవులు సూర్యోదయము నుండి సాయంత్రము వరకు తమతమ పనులు చేయుదురు. సూర్యుడు లేని సమయమున పనులు జరుగవు అతనిలోని శక్తి బ్రహ్మశక్తియే.

**12. స్స చంద్రసే = అతడే (ఆ బ్రహ్మనే) చంద్రుడు.**

శ్రేష్ఠ సంతోషింప జేయువాడు చందమామ. చంద్రయతీతి చంద్రః ఆహ్లాదమును జేయును గనుక చంద్రమ. సూర్యచంద్రులు కూడా బ్రహ్మ ప్రకాశము వలనే వెలుగుతున్నారు. కనుక వారు బ్రహ్మమే.

**13. స్తే సురా** = అతడే (ఆబ్రహ్మమే) సురులు

సురులనగానే దేవతలు. తాముపొందిన ఆత్మ జ్ఞానము వలన జన్మ రహితము కాజాలదని గుర్తించి " ఆత్మాతీతం కేవలాత్మ" అని చెప్పబడే కేవలాత్మ స్వరూపమగు పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియజేయు పూర్ణ గురువుల నాశ్రయించి తాను తరించుట మాత్రముతో తృప్తి జెందక **"స్వయం తీర్ణః పరాం తారయతి"** అనే న్యాయమున తోడి మానవుల తరుణోపాయమునకు తోడ్పడుచు పారమార్థికముగా సమిష్టి శ్రేయోదాయక కర్మల నాచరించువాడు మానవులందలి దేవతలు. వారే సురులు, జేజేలు, మహాత్ములు వారిలో ఉన్నది దైవీశక్తి బ్రహ్మమే. కేనోపనిషత్తు 3,4 భాగములను పరిశీలించుము.

**14. స్తే అసురా అసురులు = వారే ( ఆ బ్రహ్మమే) అసురులు**

తత్వ జ్ఞానార్థదర్శనం లేకుంటే జ్ఞానము లేదని చెప్పాలి. అట్టి జ్ఞానరూపం వహించు శక్తి గలమానవుడు తన మనస్సు కేవలం ఐహిక ప్రయోజనములకు ఉపయోగించిన పశు సమానుడే. కాగా అట్టి జ్ఞాన సముపార్జన గావించుటకై మానవులు తమ అభిని వేశమునను సరించి తత్వ విచారణయో, అంత రేంద్రియ పంచకములోని జ్ఞానమనోబుద్ధి చిత్తాహంకారములను పురస్కరించుకొని సాధన చేయుచున్నారు. ఈ సాధన యందు గలిగిన శక్తినో, మహాత్తునో తమస్వార్థ ప్రయోజనమునకై వినియోగించుకొని ప్రజాసామాన్యమునకు తాము గొప్ప మహాత్ములని చాటుకొనుచు నమ్మకము కలిగించి మూఢ జనులను మోసగించి, ధనము సంపాదించు దుష్టులే మానవ రాక్షసులు – వీంకూడా బ్రహ్మమే. వీరియందు బ్రహ్మము పరావాగ్రూపమున, వైఖరి రూపమున నున్నది.

**15. స్తే పిశాచ = వారే (ఆ బ్రహ్మమే) పిశాచములు.**

'పిశితత మశ్నంతీ'తి పిశాచాః మాంసమును భక్షించువారు. కుబేరానుచరులు. మాంసము భుజించుటకు సత్తా నిచ్చునది ఆత్మయే. చేసే కృత్యముతో పనిలేదు. వ్యాపారమును బట్టి అట్టి పనులు అవి చేస్తున్నవి. కాని ఆ పనులు చేయుటకు సత్తానిచ్చునది బ్రహ్మమే. కనుక బ్రహ్మమే పిశాచము. వాటినామ రూపములు వదిలితే అంతా బ్రహ్మమే.

**16. స్తే మనుష్యా = వారే (ఆ బ్రహ్మమే) మనుష్యులు.**

మానవశబ్దము మనస్సు అనుశబ్దము నపేక్షించి కలిగినదనవచ్చును. ఐతే పశు పక్షి క్రిమికీటక లతాదులందు మనస్సు లేదా అంటే వాటి యందు ఈ మనస్సు అల్పము. ఈ మనస్సు వానికి కావలసిన ఆహారపానీయములు సంపాదించుటకు తగినంత మాత్రమే యున్నది. మానవుడు వైఖరీ వాక్కు కలిగి తన భావములన్నియు వర్ణాత్మకమగును శబ్ద జాలముతో కూడిన వాక్కు ద్వారా సర్వవ్యవహారముజరుపుచున్నాడు. ఒక్క ఐహిక ప్రయోజనములకే కాక మానవుడు తన మానసిక శక్తులను విద్యాధ్యాన, తపోనిష్ఠా నాది సాధనములచే పారమార్థిక విషయములను సైతము మానసిక ప్రత్యక్షము గావించు కొనుచున్నాడు. మన్ అవబోధనే మానవుడు. వీరియందు పరావాక్కు తపోనిష్ఠానాది రూపమున బ్రహ్మమున్నది గాన వీరు బ్రహ్మమే.

**17. స్తా స్త్రియ = వారే (ఆబ్రహ్మమే) స్త్రీలు.**

స్త్రీలు కూడా బ్రహ్మమే. నేనే బ్రహ్మనని అహంబ్రహ్మాస్మియని మహావాక్యము పలుకుచుండగా నేనైన స్త్రీ లింగభేదముచే బ్రహ్మము కాకపోదు. స్త్రీ కూడ బ్రహ్మమే. వారు మనస్సు వాగ్వైఖరి గలవారు. మనుష్యులే. లింగ భేదము చేత, జననాంగములందు భేదముండుట చేత, మరి కొన్ని ఆకృతుల వల్ల మనకు వారు స్త్రీలుగా కనబడుచున్నారు. వీరియందు బ్రహ్మము ఆత్మరూపములో నుండి సకల వ్యవహారములు చేయించుచున్నది. కావున స్త్రీ పురుషులు కూడా బ్రహ్మ స్వరూపులే.

**18. స్తే పశ్వాదయ = అతడే పశ్వాదులు.** పశ్వాదులు కూడ బ్రహ్మమే. బ్రహ్మము 84 లక్షల జీవరాసులను సృష్టించినది. అవి జడములగుట వలన తానే వాటి యందు అనుప్రవేశము జేయుట వల్ల వాటికి చేతనము కలిగినది. పశువుల యందు బ్రహ్మము మధ్యమ వాగ్రూపమున వసించుచున్నాడు. వాటి యందలి నామ రూపములు వదిలితే అంతాబ్రహ్మమే.

**19. స్తత్ స్థావరం = ఆ బ్రహ్మమే స్థావరము**

" సృష్టికి పూర్వము **"సదేవసోమ్యే దమగ్ర అసీత్ "** అంటే సృష్టికి పూర్వము ఆ బ్రహ్మము సత్పదార్థముగానేయుండెను. అనంతరము **"సోఽ కామయుత బహుస్యాం ప్రజా యేయేతి"** ఆ బ్రహ్మమునకు **"ఏకం అనేకం భవతి"** తానే అనేకము కావలయుననెడి కోరిక కలిగెను" **ఏకం అనేకం భవతి"** తానే అనేక మాయెను. అట్లేనకముగా సృష్టించినది జడములగుటవల్ల **"తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్"** అందు తానే అనుప్రవేశముగావించెను. వాటిలో రెండు రకములు. స్థావరములు, జంగమములు, పుట్టిన స్థానమునుండి కదలనివి స్థావరము. కదిలేవి జంగమము, వీటియందు సూక్ష్మముగా "త్వం" రూపములో బ్రహ్మమున్నది. కనుక స్థావరములు బ్రహ్మమే.

**20. తే(బ్రాహ్మణాదయ = అతడె (బహ్మాతాదులు తే(బహ్మాణాదయ సర్వఖల్విదం(బహ్మ. నేహనానాస్తి కిఞ్చన** సర్వము (బహ్మమే, (బహ్మదేవుడు మొదలు (బహ్మనాంతమగు భేదము కొంచమైన లేదు. పై జెప్పిన వన్ని (బహ్మమే. సర్వవస్తువుల బాహ్యాభ్యంతరముల యందు నిండియున్నది. పరమాణువు యొక్క బాహ్యాభ్యంతరములందు ఈ (బహ్మవ్యాపకమ య్యెయున్నందున వున్న దంత (బహ్మమే. భౌతిక వస్తువు గాని, నామరూపములు గాని మిథ్యయని (బహ్మమే సత్యమని చెప్పబడినది. సృష్టికామన కలిగిన (బహ్మమే నామరూపములు (ప్రకటించి, స్థూలమగు జగ(ద్రూపము (ప్రకటించి **"స్వర్వఖల్విదం (బహ్మ" (బహ్మణోన్యం నకించన** (బహ్మము కన్న అన్యముగా యేది లేదు. అంతా (బహ్మమే. అందుకే **(బహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం"** విశ్వమే (బహ్మము, నేను ((బహ్మము) తప్ప మరొకటి విశ్వమునందు లేదు. అందుకే జీవో (బహ్మైవనాపరః అని (శుతి.

**శ్లో|| ఆ (బహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం ।**
**స్థావరం జంగమంచైవ (ప్రణమామి జగన్మయం ॥**

అని గురుగీత గానం చేసింది. గడ్డి పోచమొదలు (బహ్మ పర్యంతము సమస్తము పరమాత్మ స్వరూపమే కాని అన్యములేదు. కదలనివి, కదిలేవి అగు సమస్త (ప్రాణులున్ను (బహ్మమే. జగమంత ఆ పరమాత్మమయమై యున్నది.

**మం. శ్లో|| జాతిరితచ, నచర్మణో నరక్తస్య నమాంసస్య నచాఽ స్థినః, న జాతి రాత్మనో జాతి ర్వ్యవహార కల్పితా, కర్మేతిచ, (క్రియ మాణేం(ద్రి యైః కర్మాణ్యహం కరోమీత్యధ్యా ఽ త్మనిష్ఠతయా, కృతం కర్మైవకర్మ, అకర్మేతిచ, కర్తృత్వ భోక్తృత్వాఽ ద్యహంకారతయా, బంధ రూపం జన్మాది కారణం నిత్య నైమిత్తిక యాగ(వత తపోదానా దిషుఫలాభి సన్ధానం యత్తదకర్మ -6**

తా|| జాతి యనగానేది? చర్మమునకు జాతి లేదు. రక్తమునకు జాతి లేదు. మాంసమునకు జాతిలేదు. అస్థికి జాతి లేదు, ఆత్మకు జాతి లేదు. వ్యవహారమునకు మా(త్రమే జాతి పారమార్థికము కాదు.

కర్మయనగానేది? కర్మేం(ద్రియములు కర్మను చేయునపుడు ఆ కర్మలను నేను చేయుచున్నాను. అని అధ్యాత్మ నిష్ఠగా జేయునది యే కర్మ.

అకర్మయనగానేది? కర్మ కాని ఆత్మయందు కర్తృత్వమును భోక్త కాని ఆత్మయందు భోక్తృత్వమును ఆరోపించు నదియునగు కర్మ - జన్మాదులగు బంధములకు కారణమని తెలిసి నిత్యనైమిత్తిక కర్మలను, యాగ (వత తపోదానా దులను చేయుచున్నను. ఆ కర్మ ఫలమునందు సంగము లేనప్పుడు సలుపునట్టి నిష్కామ కర్మ అకర్మయే యగును.

**21. జాతి రితిచ = జాతి యనగా**

జాతి అనగా పుట్టుక, కులము, సామాన్యము, రీతి అని అర్థములు గలవు. సామాన్య వారసత్వ భావన కీర్తి (ప్రతిష్టలు. కష్టనష్టాలు సుఖదుఃఖాలను గురించిన సమాన సంస్కృతులు కలిగి ఒక రాజ్యములో కలసి జీవించవలెననెడి గాఢమైన కోరిక కలిగి తమ సంస్కృతి నాగరికతను వారసత్వంగా తమ సంతతికి ఇవ్వవలెనెడి కోర్కెవున్న (ప్రజాసము దాయమునే జాతియని నిర్వచించారు. **రేహన్,** ఇట్టి సమాజముతో నున్నవారి నందరిని పరిశీలించిన వారి చర్మమునకు జాతిలేదు. వారి రక్తమునకు జాతి లేదు. వారి శరీరము

లేర్పడిన మాంసమునకు జాతి లేదు.వారి ఎముకలకు జాతి లేదు. మరియు వారి ఉనికికి జాతి లేదు. వారి ఆత్మకు జాతి లేదు. వ్యవహారమునకు మాత్రమే జాతి, పారమార్థికముగా లేవు. పారమార్థికంగా ఆత్మ ఒకటే, రెండూగా లేవు. భేదమేమంటే ఉపాధిలో ఉన్నప్పుడు ఆత్మన బడుచున్నది. ఉపాధివదిలిన బ్రహ్మాయని అంటున్నాము. ఆత్మ శరీరములు కలిసేయున్నవి. మానవుడు పుట్టుకతో మనస్సుండి, చర్మము రక్తము ఎముకలుండి జన్మించినాడు. కాని ఆశరీరములకు చర్మమునకు రక్తమునకు మాంసమునకు జాతి కులమ్మంటూ లేదు. పుట్టుకతో ఏజాతిలో, కులములో ప్రదేశములో పుట్టునో ఆ ప్రదేశము యొక్క జాతి వాని జాతిగా నెంచబడును గాని రక్త మాంసములతో కాదని తెలియవలయును.

శ్లో॥ "జాతినీతి కులగోత్రదూరగం । నామరూప గుణదోష వర్జితమ్ దేశ కాలవిషయాతి వర్తియ । ద్బ్రహ్మ తత్వమసి భావయాత్మని॥ బృహద్వాశిష్టము. మానవుడు వ్యవహారమున తనకు నచ్చినవిధంగా కొన్ని కట్టు బాట్లు జేసి ఒకే రక్తము పంచుకొని పుట్టిన వారందరిని జాతిగా పరిగణించుచున్నాడు. ఎరుక యందు ఎరుక సత్యమే గనుక, ఎరుకలో వున్నవానికి నామ, రూప, రంగు, గుణములను బట్టి భేద బుద్ధి బూని జాతి యంటున్నాడే గాని నిజంగా వాటి నన్నిటిని వదిలి ఎరుక వదిలిన వానికి జాతిలేదు కులము లేదు, రంగు లేదు, రూపము లేదు, తానే లేదు ఇవన్నీ ఎక్కడివి అనే ఆలోచనలో వుంటాడు. ఇవన్నీ ఎరుక కల్పితములని గ్రహించవలయును.

## 22. కర్మేతిచ = కర్మయనగా.

కర్మయనగా కృ అనుధాతువునుండి వ్యుత్పత్తి. కర్మయను శబ్దమునకు పని యని, ఆపని చేయుటవలన కలిగిన ఫలమని రెండర్థములు గలవు. సకల కర్మలకు జ్ఞాన శక్తి, వ్యవహారము. జ్ఞానేంద్రియముల ద్వారా శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములను తెలుసు కొని వాని యొక్క మంచి చెడ్డలు, మనోబుద్ధులు, చిత్తాహంకారములను అంతః కరణము ద్వారా నిర్ణయించును. 2. ప్రాణ శక్తి (క్రియాశక్తి) క్రియాచరణ కంతకు ప్రాణశక్తి ఆధారముగా నున్నది. ప్రాణ శక్తియే కర్మేంద్రియములద్వారా వచన గమన ఆనంద విసర్జన క్రియలు గావించునదియు ప్రాణ శక్తియే.

ఈ విధముగా కర్మ జరుపుచు ఆయా కర్మానుభవములో ఆనందిచవలె ననే ఆశతో అంతఃకరణము ఎదురుచూచు చుండును గాని అనుభవమునకు రావు. అందు దృష్ట ఫలమే ప్రస్తుతము సిద్ధించును గాని అదృష్టఫలము ముందెప్పుడో గాని సిద్ధించదు. మానవుడొనరించు సుకృత దుష్కృతములను గూర్చి జప్తికి తెచ్చుకొనరాదు. లేక ఇతరులతో చెప్పరాదు. ఇట్లు స్మరించుకొనుటవల్ల. ఇతరులకు వాటిని గురించి చెప్పుట వల్ల సంస్కారము లేర్పడును. అట్టి సంస్కారములను దృష్టాదృష్ట ఫలమని పేర్కనబడినది. ఈ త్రివిధములైన సంస్కారములను నాశనము గావించు కొన్నప్పుడే జన్మ రాహిత్య మోక్షము సిద్ధించును. ఇది కేవలం పరిపూర్ణ బోధవల్లనే సమకూరును.

## 23. అకర్మేతిచ = అకర్మయనగా

పరిపూర్ణ సిద్ధాంతమున ఆత్మయే కర్త, భోక్త, జన్మాదులకు మూల కారణమదేయని

నిర్ణయము. పరిపూర్ణ భావజ్ఞుని దృష్టిలో స్వయం ప్రకాశము గల ఆత్మయే సర్వమునకు మూలము. జ్ఞానము, గుర్తు లేకుండా అనగా సంకల్పించకుండా ఎవరున్నూ ఎట్టి కర్మచేయరు. ఏది లేకుంటే కర్మ జరగదో దానినే కర్తృత్వమని చెప్పవలయును. **"తేనవినా తృణాగ్రపి నచలతి"** అనగా సర్వ సత్తాంశరూపమగు ఆత్మయే లేనిచో ఏది జరుగదు. కనుక సర్వమునకు ఆ యాత్మయేకర్త, భోక్త. దాని సత్తా లేనిచో గడ్డి పరక కూడా కదలదు. ఆ బ్రహ్మ చైతన్యమే లేనిచో జీవేశ్వరుల వ్యాపారమేలేదు. ఏది లేకుంటే అసలు కర్మ అనేదే జరుగ జాలదో దానినే కర్త అని అనాలి. అందుచేతనే శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు తమ కదార్థములలో క.ద.52 **ఆటాడి ఆడ కుందును అటాడిన మేనుబొమ్మ యాటాడకనే। ఆటాడు ఎరుక యనియెడి। యాటాడించేటి వాడు అతదేరా కర్త । అంతటికి యీ అచల మకర్తా । చేటుపాటుల రెంటిచే వొచ్చు ఫలము । ముమ్మాటి కనుభవించి । మరణ జననము లొంద । నతఢే రాకర్తా "** అంటూ పరిపూర్ణ బోధరీత్యా సిద్ధాంతము జేసి యున్నారు. కనుక పిండాండమందు ఆత్మనే కర్త మరియు భోక్త, బ్రహ్మాండమందు పరమాత్మయే కర్త మరియు భోక్త యని నిర్ణయము.

అచల సిద్ధాంతము ప్రకారము ఇచట నిష్కామకర్మ అకర్మయనుటకూడా సరియైనదిగాదు.

కర్మచేయకుండ యుండుట సాధ్యముగాదు. అంతరేంద్రియ క్రియా వ్యాపారములు వల్ల సంస్కారము లేర్పడుచున్నవి. జన్మరాహిత్యమునకు కర్మసన్యాసము అసాధ్యము, నిరుపయోగము అయివున్నది. నిష్కామ కర్మయనగా ఫలము నాసించకనే కర్మ చేయుట లేక ఈశ్వరార్పాణముగా కర్మలు చేయుట, కర్మ ఫలములను శ్రీ కృష్ణార్పణమస్తు, శివార్పణమస్తు అని కర్మాంత మందు కర్మఫలము దార బోయుట వల్ల కూడ జన్మకర్మల నుండి విముక్తి నీయ జాలదు. ఏలననగా?.

1. ఏ ఫలము కోరకుండా ఏ పనినైననూ ఎవరైన ఎప్పుడు చేయరు. 2. స్థూల పదార్థమును తేలికగా మరొక చేతిలో పెట్టినట్లు సూక్ష్మమగు అదృష్టఫలమును మార్పిడికి అవకాశం లేదు. 3. అస్తు అంటే అగుగాక అని అర్థము. శివార్పణమస్తు అంటే కర్మఫలము శివునకే చెందు గాక ! అంటే చెంది పోవునా ? అట్లు చెందింపగలశక్తి ఏమహార్షికైనా నుండు నేమోకాని సాధారణ సాధకునికి సాధ్యమగునా ? 4. పుణ్యఫలమును వదులు కొనుట త్యాగమనిపించుకొనునేమోగాని, ఒకనిని చంపి ఆపాపము ఇతరులపై నెట్టి వేయుటకు యేమన వలెను ? తాను విషముమ్రింగి ఇతరులు చావవలెనంటే చత్తురా? కర్మఫలము తేలికగా వదిలిపోదు. కావున పరిపూర్ణభావజ్ఞులు అగామినశించుటకు కర్తృత్వరహిత కర్మాచరణ విధానమును సూశించినారు. పరిశీలింతము.

కర్తృత్వమనగా ఒక పని చేసినందుకు బాధ్యత. పంచ కారణములు లేనిదేపని జరుగదు. " **అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృదగ్విదా వివిధాచ పృథక్చేష్టాదేవం చైవా త్రపంచమం॥** భ.గీ. అనగా అధిష్ఠానము శరీరము (సూక్ష్మ శరీరము). 2. కర్త అంతః కరణముతో కూడిన చైతన్యం (జీవుడు చిదాభాసుడు) 3.ఇంద్రియములు 4. వివిధములగు ప్రాణచలన రూపము లగుక్రియలు. 5. అధిష్ఠాన దేవతలు, ఈ ఐదు కారణములతో

గూడిన చైతన్యము ప్రధానకర్తని చెప్పవలెను. ఏలననగా జీవుడే గుర్తెరుగుచు నాకర్మలను యుద్ధేశపూర్వకముగా జేయుచున్నాడు. మరి బ్రహ్మాండమందు కర్తృత్వమెవరిది? అంటే ఈశ్వరునిదే. ఇక పోతే సృష్టి కర్మకు ఆదిలో కర్తత్వ మెవరిది? సృష్టి సంకల్పము చేసిన బ్రహ్మముదే. అయితే జీవేశ్వరులు బ్రహ్మము కంటే భిన్నులు కారు. ఆ బ్రహ్మచైతన్యమే జీవేశ్వరులనే పేరుతో పిండాండ బ్రహ్మాండములందు కర్తత్వము వహించుచున్నది.

కర్తృత్వాభిమానము లేకపోతే కర్మఫల భోక్తృత్వముండ జాలదని పరిపూర్ణ భావజ్ఞులు సిద్ధాంతము చేసి యున్నారు. ఎట్లనగా – యజమాని చెప్పినట్లు సమస్త వ్యవహారములు చేయుగుమాస్తకు ఆ వ్యవహారములో చివరకు కలుగు లాభనష్టములతో యెట్టి సంబంధముండదు. ఆత్మ నివేదన గావించియున్నాను, నేను నిమిత్తమాత్రుడనై విద్యుక్త ధర్మముల నాచరించుచున్నాను, అందలి జయాప జయములతో నాకు నిమిత్తము లేదు అనే దృఢముతో అహంకార మమకారము లేకుండా భక్తుడు సకల కర్మల నాచరించియు ఆ కర్మఫలములచే బద్ధుడగుటలేదు.

**శ్లో॥ జ్ఞానం జ్ఞేయం, పరిజ్ఞాతా, త్రివిధకర్మ చోధనా॥ కరణంకర్మ కర్తేతి, త్రివిధః కర్మ సంగ్రహః – భ. గీ.** అనగా కర్మను పోత్సహించు త్రిపుటి ఏమనగా జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత, ఎందువల్లననగా గుర్తెరుగ కుండా యెవ్వరూ యే కర్మ చేయరు. 1. కర్మ 2. కర్త, 3. కరణము (పనిముట్లు) అను త్రిపుటిచే కర్మ జరుగుచున్నది. జ్ఞాత యేకర్త జ్ఞానమే కరణము ఈ రెండు లేనేలేవని ధృఢ నిశ్చయమై కర్మ చేస్తే అకర్మ చేసియు చేయనట్లే అగుచున్నది. ఇదే వినకనే వినుట, కనుకనే కనుట, తినకనే తినుట. ఈ రెండు త్రిపుటులు లేనివని నిశ్చయమున్నవానికి కర్మ ప్రవృత్తి కవసరమగు కాంక్ష (ఫలాసక్తి) గాని, కర్తృత్వాహంకారము గాని ఉండదు. అంటే కర్తృత్వ రహితముగా నిష్కామకర్మ జరుగుచున్నది. అది బంధకారణము గాదు. అహం అనే అంకురము కాలిపోవును. వేయించిన విత్తనము మొలకెత్తనట్లు తిరిగి పుట్టుక లేక పోవును. జన్మరాహిత్య మోక్షము సిద్ధించును. కనుక కర్తృత్వ రహిత కర్మాచరణమే అకర్మ.

**మం. శ్లో॥ జ్ఞాన మితిచ దేహేంద్రి నిగ్రహ సద్గురూపాసన శ్రవణమనన నిది ధ్యాస నైర్యధ్యర్య దృగ్ధశ్య స్వరూపం సర్వాంతరస్థం సర్వసమం ఘటపటాది పదార్థమివా ౽ వికారం వికారేషు చైతన్యం వినా కించిన్నా ౽ స్తీతి సాక్షాత్కారా౽ నుభవజ్ఞానం. అజ్ఞాన మితిచ, రజ్జౌ సర్ప భ్రాన్తిరివా౽ ద్వితీయే సర్వాను స్యూతే సర్వమయే బ్రహ్మణి దేవ తిర్యఙ్నర స్థావర స్త్రీ పురుష వర్ణాశ్రమబన్ధ మోక్షాది భేద కల్పితం జ్ఞాన మజ్ఞానం – (7)**

తా॥ జ్ఞాన మన నేది? దేహ, ఇంద్రియ, సంశయముచేతను సద్గురు పాసన చేతను, శ్రవణమనన నిది ధ్యాసనముల చేతను, దుగ్దృశ్య స్వరూపమైన దంతయును సర్వాంతర్యామియై యున్నది. ఘట పటాది వికార వస్తువులందు వికార రహితమైనదగు చైతన్యము తప్ప వేరొకటి ఏదియు లేదను సాక్షాత్కారానుభవమే జ్ఞానము. అజ్ఞానమనగా నెద్ది? తాటి యందు సర్ప భ్రాంతివలే కేవలం సర్వాంతర్యామి సర్వస్వరూపమగు బ్రహ్మము నందు దేవతలు, పశువులు, మనుష్యులు, స్త్రీలు, పురుషులు, వర్ణా శ్రమములు, బంధ మోక్షములు అను అనేక భేదములచే కల్పితమైన జ్ఞానమే అజ్ఞానము.

**24. జ్ఞానమితచ = జ్ఞాన మనగా.**

జ్ఞాన శబ్దమును భగద్గీత నిర్వచించిన విధమును తెలుసు కొందము.

**శ్లో॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యంత్వం, తత్వ జానార్థ దర్శనం ।**

**ఏతత్ జ్ఞానమితి ప్రొక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥**

తా॥ నిత్యమగునది ఆత్మ యొక్కటేయే యనియెరింగి ఆత్మ తత్వము యొక్క సాక్షాత్కారము పొందియుందుటయే జ్ఞానము గాని మిగతా అంతయూ అజ్ఞానమని భావము.

**శ్లో॥ యద్ జ్ఞాత్వాన పున ర్మోహ మేవం యాస్యసిపాండవ ।**

**యేన భూతాన్య శేషేణ, ద్రక్ష్య స్యాత్మన్యథో మయి॥ భ.గీ॥**

తా॥ దేనిని తెలిసినచో తిరిగి మోహము కలుగదో దేనిని తెలియుటచే నీయందునూ నాయందునూ కూడా సకల భూతములను చూడ గలవో అదియే జ్ఞానము. మరియు సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని" అనగా తనయందు సర్వభూతములను సర్వభూతముల యందును తననూ చూడ గలుగుటయే జ్ఞానము.

ఇట్టి జ్ఞానము మానవులందు మాత్రమే సాధ్యము. మానవుని మనస్సుకు అతీతశక్తులున్నవి **"మనోహిజతువత్"** అనగా మనసు లక్కవంటిది. లక్కను కరిగించి ఏ మూసలో పోసిన ఆ యాకారము ధరించునట్లు ఏ వస్తు రూపము నందు మనస్సు ఏ కాగ్రమగునో ఆ వస్తురూపము మనస్సు ధరించగలదు. ఆ వస్తువు యొక్క స్వరూప స్వభావములను సంపూర్ణముగా మనస్సునందు వ్యాపకము కాగా మనస్సుతన్మయమై పోవును. ఇదే వస్తు సాక్షాత్కారము, తత్వజ్ఞానార్థ దర్శనం, ఆత్మ సాక్షాత్కారము. ఇట్టి దర్శనం లేకుంటే జ్ఞానము లేదు.

**25. అజ్ఞాన మితిచ = అజ్ఞానమనగా**

అజ్ఞానమనగా జ్ఞానము లేకపోవుట అని కొందరు అంటారు. కాని అజ్ఞానం అట్టి భావన రూప పదార్థముగాదని, అభావ పదార్థమే అగుచో దాని వల్ల ఎవరికి ఎట్టి బాధ కలగ కూడదని మరి కొందరంటున్నారు. లేని సర్పము భయహేతువై బాధ పెట్టుటలేదా? మొదటి వారంటున్నారు. గాఢాంధకారములో కన్ను మిన్ను కానరానప్పుడు చీకటిలో పడి యున్న త్రాడు వల్ల యెవరికి యే బాధ లేదు. కాని మధాంధకారములో మసక చీకటిలో ఆ తాడునే చూచి అది పామని భయము కలిగినది. కనుక చీకటి దట్టముగా వుంటే బాధలేదు. కాని అజ్ఞానమునకే విక్షేపమను అను మరొక శక్తియున్నది. ఆవరణ శక్తి నిజరూపమును తోచనీయక మరో రూపము తోపించును. అదే భయభ్రాంతులకు కారణమగుచున్నది. వస్తువు సంగతి యేమి తెలియకపోయిన బాధలేదు. లేక వున్నది వున్నట్లుగా తెలసిన బాధలేదు. తెలసి తెలియని లక్షణమే బాధకారి. రెండు అజ్ఞానములే. ఒకటి తమోగుణ సంబంధము. ఉన్నది వున్నట్లు తెల్పేది సత్వగుణాంశము, కనుక ఒకే వస్తువునందుండే సత్వగుణలక్షణముచే "సత్వాత్ సంజాయతే జ్ఞానం" జ్ఞాన మున్నురజోస్తమో గుణాంశములచే ఆవరణ శక్తులు గల అజ్ఞానమున్ను బహిర్గతములైనవి. జీవజగత్తులు ప్రకృతి యందలి రజస్తమోగుణాంశముల చేతనే సృష్టి ఆయెను గదా !

**శ్లో॥ గూఢా విద్య జగన్మాయా, దేహోశ్చ జ్ఞాన సంభవః॥**
**విజ్ఞానం తత్ప్రసాదేన గురుశబ్దేన కథ్యతే॥ గురుగీతా.**

తా॥ అవిద్యా (అజ్ఞానము) అతి రహస్యముగానున్నది. జగత్తు మాయా స్వరూపము. దేహము అజ్ఞానమువల్ల కలుగుచున్నది. ఎవరి కృపవల్ల విజ్ఞాన మంతయు తెలియుచున్నదో అతడే గురుశబ్దముచే చెప్పబడుచున్నాడు.

ఈ శ్లోకమున దుఃఖాదుఃఖ హేతువైన అజ్ఞాన విషయమే చెప్పబడినది. అట్టి జ్ఞానము దేహోత్పత్తికి కారణమైనది. ఎట్లునగా అది కేవలం పరమాత్మ స్వరూపముగా నున్న తాను తన యందున్న తమో గుణము యొక్క ఆవరణ దోషముచే తన స్వరూపమును మరిచినాడు. అంతటితో ఆగక రజోగుణ సంబంధమగు విక్షేపశక్తి ప్రభావముచే తన ఆవరణమును చూచుకొని అదియే తానని అనుకొన్నాడు. ఈ దేహ తాదాత్మ్యమే తన బంధ కారణమై పోయెను. ఈ శ్లోకమున "దేవాశ్చా జ్ఞాన సంభవః" అనగా దేహము అజ్ఞానము వలన కలిగినదన్నారు. ఇట్టిదేహమునే నేను అను కొనుటే జన్మపరం పరలకు కారణ మగుచున్నది. ఎట్లునగా ఆదేహమే నేననుకొని ఆదేహ సుఖమునకు తోడ్పడు ధన కనక వస్తు వాహనాదుల యందు పుత్ర మిత్ర కళాత్రాదుల యందు మమకారము పెంచుకొని పాపపుణ్యకర్మ లొనర్చి అగామి కర్మను ప్రోగుచేసుకొనుచు భావిజన్మలకు పునాదులు వేసుకొనుచున్నాడు. అట్లే మన పూర్వ జన్మము నందలి దేహతాదాత్మ్యమే వర్తమాన దేహమునకు కారణమైనది. ఈ విధముగా పూర్వ పూర్వ ఉపాధులయందలి అజ్ఞానము వుత్తరోత్తర దేహోత్పత్తికి కారణమగుచున్నది. స్వస్వరూప విస్మృతియు, తదనంతరము దేహ తాదాత్మ్యమున్ను రెండున్నూ అజ్ఞాన కార్యము.కనుక దేహోశ్చా జ్ఞానసంభవః అని చెప్పినది.

**మం. శ్లో॥ సుఖమితిచ, సచ్చిదాఽనంద స్వరూపం జాత్వాఽ శన్దరూ పాపవస్థితిరేవ సుఖమ్ః దుఃఖమితిచ, అతసంసార విషయ సజ్కల్ప ఏవ దుఃఖమ్. స్వర్గ ఇతిచ, సత్సం సర్గః స్వర్గః, నరక ఇతిచ, అసత్సంసార విషయ జనన సంసర్గఏవ నరకః బంధ ఇతిచ, అనాద్య విద్యా వాసన యా జాతోఽ హ మిత్యాది సజ్కల్పో బన్ధః, పితృ మాతృ సహోదర దారా ఽ పత్య గృహారామ క్షేత్రాది మమతా సంసారావరణ సజ్కల్పోబన్ధః " కర్తృత్వాద్యహ జ్కార ద్యహజ్కర సజ్కల్పో బన్ధః, అణిమాద్యష్టైశ్వర్యాఽ శాసిద్ధ సజ్కల్పో బన్ధః, దేవ మనుష్యాద్యుపాసనా కామ సజ్కల్పో బన్ధః, యమాద్యష్టాంగ యోగా ఽ భ్యా సాఽ ది సంజ్కల్పో బన్ధః, వర్ణాశ్రమ ధర్మకర్మ సజ్కల్పోబన్ధః, ఆజ్ఞా భయ సంశయాత్మ గుణ సజ్కల్పో బన్ధః, యజ్ఞ వ్రత తపోదాన విధి విదాన జ్ఞాన సజ్కల్పోబన్ధః మోక్షాపేక్షా సజ్కల్పో బన్ధః, కేవల మోక్ష సజ్కల్పో బన్ధః సంకల్ప మాత్ర సమ్భవో బన్ధః - (8)**

తా॥ సచ్చిదానంద స్వరూపమునెరిగి ఆనంద స్వరూపముతో నుండుట సుఖము, అనాత్మరూపములైన సంసారవిషయముల యొక్క సంకల్పమే దుఃఖము. సజ్జనుల సాంగత్యమే స్వర్గము. సంసార విషయ వాంఛలలో జనించిన సంసర్గమే నరకము. బంధమనగా అనాదియగు అజ్ఞానము యొక్క వాసనచే నేను జన్మించినాడను అను ఈ ప్రకారములైన సంకల్పములు కలిగియుండుటే బంధము. 1. తల్లిదండ్రులు, సోదరులు, భార్య బిడ్డలు, గృహము, ఉద్యానము, పొలము మొదలైన వానియందు మమత్వము

కలిగియుండి సంస్కారము యొక్క ఆవరణమును గూర్చిన సంకల్పము కలిగియుండుటయే బంధము. 2. కర్తృత్వాదులు, అహంకారము దీనిని గూర్చిన సంకల్పమే బంధము. 3. అణిమాది అష్టైశ్వర్యములను గూర్చిన ఆశ వానిని గూర్చిన సంకల్పము బంధము. 4. కేవలం సంకల్ప మాత్రమే బంధము. 5. దేవతలను మనుష్యులను ఉపాసించుకోరిక యొక్క సంకల్పము బంధము. 6. యమ నియమ ఆసన ప్రాణాయామ, పత్యహార, ధారణ, ధ్యాన సమాధి - అను అష్టాంగ యోగాభ్యాసాది సంకల్పము బంధము. 7. వర్ణాశ్రమ ధర్మ కర్మ సంకల్పము బంధము. 8. ఆజ్ఞ, భయము సంశయము మున్నగు వానిని ఆత్మగుణములుగా సంకల్పించుట బంధమే. 9. కేవలం మోక్షాపేక్షసంకల్పము గూడ బంధమే. 10. సంకల్పమాత్రమున సంభవించున దంతయు బంధమే.

**26. సుఖమితచ = సుఖము అనగా**

సచ్చిదానంద స్వరూపము నెరిగి ఆనంద స్వరూపముతో నుండుటయే సుఖము. సచ్చిదా నంద స్వరూపములను గూర్చిన వివరములు పుట సంఖ్య (1) యందు చూడగలరు.

ఆనందము సుఖము అను శబ్దముల తారతమ్యము గమనార్హము. సుఖ దుః ఖములనేవి ద్వంద్వములు. సుఖము వెన్వెంటనే దుఃఖము కలుగుచున్నది. ఈ సుఖఃదుః ఖములు రెండు శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమై యున్నది. పంచతన్మాత్రుల వలన కలిగిన కోరికలు తీరిన సుఖము. తీరనిచో దుఃఖముకలుగును.

**27. దుఃఖమితిచ=దుఃఖ మనగా**

అనాత్మ రూపములైన సంసారవిషయముల యొక్క సంకల్పమే దుఃఖము. ఆత్మా, అనాత్మయంటు రెండు ఎప్పుడును లేవు. ఈ విషయమును గ్రీకుల కంటే పూర్వమే భారతీయులు వెల్లడించినారు. రెండున్నాయంటే అద్వైత సిద్ధాంతానికే హాని. అనాత్మ రూపములై సంసార విషయముల సంకల్పమే దుఃఖమనుట సరిగాదు. ఆత్మరూప సంసార విషయ సంకల్పమే దుఃఖమని అనుట సమంజసము.

భార్య బిడ్డలు, ఆస్తి పాస్తులతో గూడినది సంసారము గాదనీ, జనన మరణములతో కూడినదే సంసారము. దీనిని చిత్ర సంసారమన్నారు. అశ్రేష్ఠపదార్థము అసారమని శ్రేష్ఠ పదార్థము సారమని చెప్పబడుతుంది. సంసారము అనగా సం+సారము = సంసారము. అనగా అత్యంత సారభూతమైనదే సంసారము. సర్వ సృష్టికి కారణమైన బ్రహ్మ (ఆత్మ ఎరుక)యే సంసారము, కనుక శ్రీ కృష్ణదేశికుల వారు "ఆగమ నిగమోపనిషత్సాగర మథి తార్థము" అనగా అనంతములైన ఆగమములు నిగమములు ఉపనిషత్తులు అన్నియు సాగరముగా జేసి మథించినచో తేలిన సార భూతమగు పదార్థము ఏదనగా నిగమ ప్రసిద్ధిగావించిన ఆత్మయే (యెరుక)యే దానినే చిత్ర సంసారమని వర్ణించబడినది. ఎందుకనగా.

**శ్లో॥ సన్నాప్య సన్నా ప్యుభయాత్మికానో, భిన్నాప్య భినా ప్యుభయాత్మికానో। సాంగాన్య సంగాన్యుభయంత్మికానో మహాద్భుతా నిర్వచనీయ రూపా॥** అనగా మాయ, సత్తు, సదసత్తులు భిన్నము, భిన్నా భిన్నము సావయవము నిరవయనము ఉభయాత్మకము అన్ని అయివుండి యిదమిత్థమని నిర్ణయించ రానిదై మహాద్భుతమై యున్నదన్నమాటలు అక్షరాల ఆత్మకున్ను వర్తించును కనుకనే ఆత్మనే మహాద్భుతమైనది. ఎన్నో విచిత్రాలు యీ ఎరుక చేతలు. అన్ని

వింతలకు పుట్టినిల్లని శ్రీకృష్ణదేశికులు సెలవిచ్చియున్నారు. కావున ఆత్మ రూపమై సంసారముల అనగా జనన మరణముల యొక్క సంకల్పమే దుఃఖము.

**28. స్వర్గమితిచ = స్వర్గమనగా**

'సత్సంసర్గస్స్వర్గః' సజ్జనుల సాంగత్యమే స్వర్గము. **సత్సంగత్వే నిస్సంగత్వం। నిసంగత్వే నిర్మోహత్వం। నిర్మోహత్వే నిశ్చల తత్వం। నిశ్చల తత్వే జీవన్ముక్తిః॥**

అని చెప్ప బడినది. అనగా సాధకునకు సత్సహవాసమున అసంగత్వము కలిగి మోహవర్జితుడై తత్వజ్ఞానము తెలసి తాను బ్రహ్మమని తెలసి జీవన్ముక్తి సాధించును. తాను జీవుడనే భావమును వదిలితే బ్రహ్మభావము కలుగును. బ్రహ్మ భావన వల్ల సంసారము నుండి ముక్తి లభించును. ఇదే స్వర్గము. పరిపూర్ణభావము దిగువ శ్లోకమున గమనించగలరు.

**శ్లో॥ నమోక్షో నభసః పృష్ఠే నపాతలేన నభసఃభూతలె**
**అజ్ఞాన హృదయ గ్రన్దేర్నాశో మోక్ష ఇతిస్మృతః ॥**

ఆకాశమునందు మోక్షము లేదు. పాతాలమందును అది లేదు, భూతల మందున మోక్షము లేదు, జ్ఞానా జ్ఞానరూప హృదయ గ్రంధి యొక్క నాశనమే మోక్షము అనబడును. మానవో పాధికి వచ్చినవారు పరిపూర్ణ గురువు నాశ్రయించి పరిపూర్ణ బోధ సంపూర్ణగా తెలుసుకొని కర్మ త్యాగము, కర్మఫల త్యాగము ననుసరించక కర్తృత్వరహిత పద్ధతిగా కర్మలొనర్చి హృదయ గంధి విడునాడు పద్ధతి తెలుసుకొన్నవారే సంతోషముగా జనన మరణ భీతి రహితముగా కాలము గడుపగలరు. ఇట్లుండుట స్వర్గములో నుండుట. విలాసములు లేనిదే కైలాసము, కుంఠితముగానిదే వైకుంఠము. బృహద్వాసిష్ఠము.

**29. నరక మితిచ = నరకమనగా** సంసార విషయ వాంఛలలో జనించిన సంసర్గమే (సంబంధమే) నరకము. జనన మరణములతో కూడినదే సంసారమని మనము తెలుసుకొన్నాము. సంసార విషయ వాంఛలతో జనించిన సంసర్గమే నరకము. కామ క్రోధ లోభమోహ మద మాత్సర్యములందు దగులు కొని చివరకు కోరిన కోరిక తీరక అది తీర్చుకొనుట చేయరానివనులు చేస్తు అనేక దుఃఖములకు లోనగుట నరకము.

**30. బంధ ఇతిచ = బంధమనగా** అనాది యగు అజ్ఞానము యొక్క వాసనచే నేను జన్మించిన వాడను" అను ఈ ప్రకారములైన సంకల్పములు కలిగియుండుట బంధమనబడును.

బంధమనగా కట్టుబడి యుండుట. అనగా తన ఇచ్ఛవచ్చిన రీతిని సంచరించుటకు, కోరిన ఫలప్రాప్తి కలుగుటకు దుష్ఫలితములు రాకుండుటకు, స్వేచ్ఛా స్వతంత్రములు లేకుండ యేదో అవ్యక్త శక్తిచే సంకెళ్ళు వేయబడినట్లుండుట బంధమనబడును.

శబ్దాది విషయములను గుర్తించునది మనస్సు కదా? గుర్తించనిచో బంధము లేదు, కనుకనే **మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో। బంధాయ విషయా సక్తం మోక్షం నిర్విషయం మనః॥**

అనగా మనసు విషయములతో కూడినపుడు బంధము. నిర్విషయము చేస్తే మోక్షము, తత్వ జ్ఞానార్థ దర్శనం.

బ్రహ్మకు సంకల్పము కలుగుట యేముడి. ఇదే జగజ్జనన కారణము. ఇది జ్ఞాన కర్మల బంధము. జ్ఞాన కర్మలు కలిసి రెండింటిని బంధించినవని చెప్ప వలయును. కనుక పరమాత్మ స్వరూపమైన బంధము యిట్టిది. ఈజ్ఞాన కర్మలు అనాదిగా యుండుటచే బ్రహ్మమే బంధమనవలెను.

అజ్ఞానము అనాది. అజ్ఞానము వ్యష్టిభావము. జ్ఞానము సమిష్టి భావము. సమిష్టి భావమును మరిచి, వ్యష్టి లక్షణములను అలవరుచుకొని కర్మ బంధములో చిక్కుకొని జీవ భావములో యుండుటవల్ల తాను జన్మించినాననుకొని కర్మ బంధములో చిక్కుకొని యుండును. జ్ఞాని యైనవాడు సమిష్టిభావములో యుండి తాను పుట్టనే లేదు. తనకు బంధ మోక్షములు లేవనె భావనతో కర్తృత్వ రహితముగా కర్మలు చేస్తాడు.

## బంధము - రకాలు

**1. పితృ మాతృ సహోదర దారాఽపత్య గృహారామక్షేత్రాది మమతా సంసార సఙ్కల్పో బన్ధః,**

తల్లిదండ్రులు, సోదరులు, భార్య బిడ్డలు, గృహము ఉద్యానము పొలము మొదలైన వానియందు మమత్వము కలిగియుండి సంస్కారము యొక్క ఆవరణను గూర్చిన సంకల్పము కలిగి యుండుటయే బంధము. ఇందుకు యోగి వేమన జెప్పిన పద్యమును పరిశీలింతము.

**ఆ॥ సతులు సుతులుమాయ, సంసారముమాయ**
**ధనము ఘనము మాయ తనువు మాయ**
**మాయగెల్చువాడు మర్మజ్ఞుడగు యోగి**
**విశ్వధాభిరామ వినురవేమ ।**

ఈ యెరుక యను మాయ యే భార్యాబిడ్డలు. సంసారము కూడా ఎరుకనే, మాయనే. ధనము కీర్తి ప్రతిష్ఠలు మాయనే. ఈ శరీరము కూడా మాయనే. మాయ యనగా ఏద్దైతే లేదో అదే మాయ. కనుక ఆలంబమును వదిలియుండు వాడు యెరుకను గెలచిన మర్మజ్ఞుడని వేమన తెలియజేయుచున్నారు. కనుక తల్లి దండ్రులపైన, భార్య సంతానములపైన, భవనములు తోటలపైన అనురాగము ప్రేమ కలిగి యుండుట బంధము.

**2. కర్తృత్వాద్యహఙ్కర సంకల్పో బన్ధః = కర్తృత్వాదుల అహంకారము వీనిని గూర్చిన సంకల్పమే బంధము.**

ఇతరులు ఆత్మ అకర్తయని, అభోక్తయని అంటారు. కాని పరిపూర్ణ భావజ్ఞులు గుర్తు (జ్ఞానము ఆత్మ) సకల కర్మలకు మూలం. కనుక ఆత్మనే కర్త మరియు భోక్తగా నున్నదని నిరూపించియున్నారు. క.ద. 52 "ఆటాది ఆడ కుందును" అనే పద్యమున ఆటాడించే ఎరుక పురుషుడే బ్రహ్మ, ఆత్మ కర్త భోక్తయని, అచల పరిపూర్ణము ముమ్మాటికి అకర్త యని స్పష్టపరచబడినది. అయమాత్మ బ్రహ్మ వార్తీక నిర్ణయానుసారము సర్వము బ్రహ్మమే యని ప్రవర్తించిననూ ఆసర్వము చేయునది ఎరుకనే. అప్పుడు నేనే చేస్తున్నాననే అహంకారము తప్పక కల్గును. నేనే కర్తను భోక్తనని తలంచును. ఇట్లు నేను చేస్తున్నాను, నేనే భోక్తను అనే అహంకారమును గూర్చిన సంకల్పము కలుగుటే బంధమని ఈ ఉపనిషత్ నొక్కి చెప్పుచున్నది.

**3. అణిమాద్యష్టైశ్వర్యాஉసిద్ధ సఙ్కల్పో బన్ధః = అణిమాది అష్టైశ్వర్యములను గూర్చిన ఆశ వానిని గూర్చి సంకల్పము బంధము.**

ఐశ్వర్యమనగా అణిమాదులు, అవి ఎనిమిది.

1. అణిమయనగా అణుస్వరూపుడైయుండ గల్గుట.
2. మహిమయనగా తానుమహాత్తు కంటే పెద్దవాడు కాగల్గుట.
3. గరిమయనగా శరీర బరువు ఎంతైనను పెంచగలుట.
4. లఘిమ యనగా శరీర బరువును ఎంతవరకైనను తగ్గించుట.
5. ప్రాప్తియనగా ఇష్ట పదార్థములను లభింపజేయుకొనుట.
6. ప్రాకామ్యము అనగా కోరుకొన్నవిధముగా సర్వశక్తులు అనగా ఆకాశగమనాదులు చేయగల్గుట.
7. ఈశ్వరత్వమనగా ఇంద్రియాధిష్టాన దేవతలపై మాత్రమే గాక ముక్కోటిదేవతలను, త్రిమూర్తులను శాసించగల్గుట.
8. వశిత్వము అనగా సర్వప్రాణులను వశము జేసి కొని వానిచే యిచ్చవచ్చినట్లు తన కార్యాములు చేయించగల్గుట.

ఈ సిద్ధులను ఉపయోగించివాని పారమార్థిక జీవితమున యిక పురోభివృద్ధిగాంచ లేదు. వీటిని కోరుట ఆశ. ఆశలందు అంద రాని దాని కోరుట ఆశ, వీటినన్నిటిని సాధించినవారు నాటికి నేటికిని యున్నారు. వీటిని ఆశించి పొందిన ధన కీర్తి ప్రతిష్ఠలకే గాని మరెందుకు కొరగావు. అంతేగాక అష్టసిద్ధులు ప్రయోగములో కలిగిన పుణ్యా పాపానుభవము కొరకు నీచోత్తమ జన్మపరంపరలు ఎత్తవలసి వచ్చును. కనుక ఈ భ్రాంతి సాధకుని యెంత మాత్రము యుండరాదు.

కనుక సకల కోరికలకు ఆశలకు భ్రాంతులకు మూలం మూలం లేని ఈగుర్తెరిగే శరీరమే అని నిర్ణయించి దాని రహితమందు తప్ప ఆశలు బంధ కారణమవుతునే యుంటాయి. నేను అనేది ఉన్నంతవరకు అన్నీ బాధిస్తాయి. నేను లేకుంటే యిక ఆశలేవరికి భ్రాంతి, బంధము, ఎవరికి, జనన మరణము లెవరికి. ఆ నేను లేకుండ చేయుమార్గమే పరిపూర్ణబోధ. పరిపూర్ణములనెరిగి ఎరుకను విడుచుటయే మార్గము అతనికి ఎట్టి ఆశలుండవు. భ్రాంతులుండవు. అతడు సర్వ కర్మలు చేసియు చేయవాడగును. ఆప్తకాముడైన పరమాత్మకు మాత్రమే యిట్టి శక్తులున్నవి. అట్టి పరమాత్మ స్వరూపుడైతే ఈ అష్టసిద్ధులు ఒక్క సారిగా చేకూర గలవు. ఆశలన్నిటిలో గొప్ప ఆశ తాను బ్రహ్మ స్వరూపుడగుటే. కొత్తగా ఆబ్రహ్మ స్వరూపుడు కానవసరము లేదు. ఎందుకనగా తనకు తెలసిన తెలియకున్న తాను తనతోపాటు సమస్త విశ్వము బ్రహ్మమే అయివున్నది. ఈ విషయము ఆరూఢమగుట బ్రహ్మమగుట, అప్పుడతని కింక ఆశలుండవు. 'కిమిచ్ఛన్, కస్య కామాయ' రీతిగా దేనినిఆశించును. వారే ఆశలుడిగిన అయ్యలు.

**4. దేవ మనుష్యాద్యుపాసనా కామసఙ్కల్పో బన్ధః**

అనగా దేవతలను మనుష్యులను ఉపాసించు కోరిక యొక్క సంకల్పము కూడ బంధము. దేవతలు మనుష్యులు ఈ సృష్టిలోని వారే. **"జగము వలన సంకల్పము। జగమాసంకల్పమునను జనయించును." మరియు కర్మము జనులకు దైవము।కర్మము**

**సుఖదుఃఖములకు కారణమధిపా॥** యని నిర్ణయాను సారము దేవాది దైవ స్వరూపంబులు, వారు యొనర్చు కర్మఫలంబులు క్షీణించగనే తిరిగి జన్మలు పొందుదురు. కనుక వారిని నియమిత దేవతలని చెప్పదగును. వీరు మానవులే. జనన మరణప్రవాహామునందే ప్రవహించెదరు. కావున యిట్టి వారిని పూజించుట బంధమే. జనులు వీరిని జీవబ్రహ్మైక్యము పొందవలెననెడి ఆశచే గాని, జీవబ్రహ్మైక్యము పొందవచ్చుననే భ్రాంతితో పూజిస్తారు. కాని వారు నిజంగా బ్రహ్మమే. తాము బ్రహ్మము కావలెననెడి కోరికచే పూజించుట భ్రాంతియే. భ్రాంతి రహితము గావించు కొను పురుషులు జన్మరహితముగోరి దేవతలను మనుష్యులను పూజించిన భ్రాంతి అధికమగును. కనుక వీరిని పూజించవలయుననెడి కోరిక భ్రాంతి జన్యము బంధ కారణము. అందుకే **"తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే"** ఇక్కడ ప్రజలు దేనిని ఉపాసించుచున్నారో అది బ్రహ్మము కాదు. అని కేశోపనిషత్తు అంటుంది. కనుక దేవతలను పూజించవలెననే కోరిక బంధమే.

**5. యమాద్యష్టాంగ యోగా భ్యాసాఽ ది సంకల్పో బన్ధః.** యమ నియమాది అష్టాంగ యోగా భ్యాసము చేయువలయునను సంకల్పము కలిగియుండుట బంధమే.

1. యమము = అనగా అహింస, సత్యము, దొంగతనము చేయుకుండుట దానం ప్రతి గ్రహించకపోవుట.
2. నియమము = బాహ్యాంతర శుద్ధి, తపస్సు, సంతుష్టి, వేదాధ్యయనము పరమేశ్వర ధ్యానము.
3. ఆసనము = ప్రాణము నియమించుటకు అనువగు అవయనములనుంచి కూర్చుండుట.
4. ప్రాణాయామము = రేచక, పూరక, కుంభకములను ఒకనియమ పద్ధతిగా నడుపుట.
5. ప్రత్యాహారము = ఇంద్రియ ములను విషయముల వెంట పరుగిడ నీయకుండుట.
6. ధారణ = చక్రస్థానములందు మనసు చలించకుండ నిలుపుట.
7. ధ్యానము = సగుణ నిర్గుణ రూపములలో పరమాత్మను ధ్యానము చేయుట.
8. సమాది = ధ్యానవిషయములందు మనస్సు చేర్చుట సమాధి.

ఈ అష్టాంగ యోగములు చిత్త వృత్తి నిరోధమునకే గాని మనో నాశముగాదు. పట్టు బిగించి యుంచినంత కాలము చిత్తము నిరోధించవచ్చును గాని ఉత్థాన దశయందు పట్టు సడలిన మనస్సుమళ్ళి యధాస్థానమునచేరి సంకల్ప వికల్పములు చేయుచునే యుండును. ఈ అష్టాంగ యోగములవల్ల ఫలితమున్నను మనోనాశముగాక జన్మకు కారణమగును. అందుకే వీనిని సంకల్పించుట కూడా బంధమే.

**6. వర్ణాశ్రమ ధర్మకర్మసఙ్కల్పో బన్ధః**

వర్ణము అనగా జాతి కులము, కీర్తి మొదలగు అర్థములు గలవు. ఇచట వర్ణాశ్రమము యనగా కులము నందు గల ఆచార్యవ్యహారములను గూర్చి సంకల్పించుట కూడా బంధము. సాంఘిక దురాచారాలలో వర్ణ (కుల) వ్యవస్థ అనేక దురాచారము లకు మూలమగుచున్నదని యోగివేమన పేర్కొంటున్నాడు. బ్రహ్మణ కులంలో పుట్టినంత మాత్రాన ఒకడు బ్రహ్మణుడు కాజాలడని ఆయనవాదము. బ్రాహ్మణత్వాని యజ్ఞోపవీతానికి సంబంధము లేదంటాడు. యజ్ఞోప వీతముతో అతడు పుట్టలేదు, లోకాన్ని విడిచి

పోయెటప్పుడు దానిని వెంట తీసుకొని పోలేదు. కన్నతల్లికి జంద్యములేదు. కాబట్టి మధ్యలో వచ్చిన యజ్ఞోప వీతము ఒక వ్యక్తికి ఎలా బ్రాహ్మణత్వము ఇప్పించ గలుగుతుంది? పుట్టుకతో ఎవడు బ్రహ్మణుడుకాడు. బ్రహ్మ జ్ఞానము పొందినవాడే బ్రాహ్మణుడు, వాల్మికి జన్మచే బోయయైన అధ్యాత్మిక విజ్ఞానము వల్ల బ్రాహ్మణుడయ్యాడు.

**రామనామ పఠన రమణచే వాల్మీకి । పరబోయడయ్యు బాపడయ్యె. కులము ఘనము గాదు గుణమే ఘనంబురా । విశ్వదాభిరామ వినురవేమ ॥**

ఒక కులం కంటే మరొక కులం ఉత్తమమని చెప్పడము అర్ధరహితము. ఇతర కులాలను మనము ద్వేషించరాదు. మనకు అట్టి హక్కు లేదు. ఒక కులము కంటే మరోక కులం, ఉత్తమమని కాని హీనమనీగాని చెప్పడానికి ప్రమాణమేయున్నది? కులం కంటే శీలము గొప్పది. ఏ కులము వాడైన, మహా యోగియైనను ఎవరిని మృత్యువు విడిచిపెట్టదు.

సకల జీవులు కలలో వస్తువుల వలెనే పుట్టుచున్నారు. కలలో వాటి వలనే లేక పోవుచున్నారు. కులము యెవ్వరు చూచినారు? గోత్రములను ఎవరుచూచినారు? కుల గోత్రములను అహంకారమే ఏర్పచినది. అహంకార మొకటే గాని అహంకారమునకు యేమి కులములు గలవు?

అట్టి అహంకారమునకు రూపములను బట్టి కులములని, గోత్రములని అహంకారభేదము లేర్పరచి తానేర్పరచిన కట్టు దిట్టములలో అహంకారము గలసి నెత్తికెక్కి మోటు బారి తిరుగుచున్నది గదా! అహంకారమునకు గురూప దేశము వలన గలిగిన దృఢమనె అహంకారమునే ఒక గొడ్డలిగా నేర్పరిచి దేహమునకు మూలమైనట్టి అహంకారమును మొదటికి బాగా తెగవేయవలెను అని బృహద్వాసిష్ఠమున శ్రీ శివరామ దీక్షితులవారు సెలవిచ్చియున్నారు. వివరములకు వజ్రసూచికోపనిషత్తు చూడగలరు.

**7. ఆజ్ఞాభయ సంశయాఽత్మ గుణసఙ్కల్పో బన్ధః**

ఆజ్ఞ, భయము సంశయము మున్నగు వానిని ఆత్మ గుణములుగా సంకల్పించుట బంధము అని గలదు. ఆజ్ఞయనగా ఉత్తరువు, దండనము అను అర్థములు గలవు. ఉత్తరువులు దండనము నిర్ణయించు సంకల్పములు కలుగుటకూడా బంధము. ఆజ్ఞ సంశయము భయము మాయ కనుకనే లేనివి. ఆత్మనే వాటికి మూలము. ఈ క్రింది శ్లోకమును పరిశీలింతము.

**శ్లో॥ జన్మాభావే కర్మం నాస్తి,కర్మాభావే ఫలంనహి।**
**ఫలాభావే భయం కుత్రా భయభావే నసంశయః॥**

తా॥ జన్మలేనిచో కర్మలేదు. కర్మలేనిచో కర్మఫలము లేదు. కర్మ ఫలము లేనిచో ఇక ఎక్కడైన భయమెందుకుండును? ఎట్టి భయము లేనప్పుడు అభయరూపము, అసంశయమైన నిరాలంబమే యుండును. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **కం॥ సంశయమే జన్మహేతువు । సంశయమే గురుని మాట చవి గొన నీయదు। సంశయమే కీడునొదవు। సంశయమెడ బాస్తివేని చాలును వత్సా॥** అని సెలవిచ్చి యున్నారు.

**సంశయాత్మ వినశ్యతి** అని గీతా చార్యుడు జెప్పినాడు. కావున గుర్తెరిగే తెలివి యున్నంత వరకు సంశయములు చిదిమిన కొలది చిగురుస్తునే వుంటాయి. సర్వసంశయములకు కారణమగు ఈ గుర్తెరిగే శరీరమునకు చోటీయని నిరాలంబమును

గురుముఖత తెలుసుకొని గుర్తెరిగే శరీరము (ఆత్మను) భావనా రూపమున వదులవలెను. ఆజ్ఞ భయసంశయ రహితము కావలయునన్న వాటిని సంకల్పించు మనస్సు లేకుండా చేసుకొనవలయును.

### 8. యజ్ఞవ్రత తపోదాన విధి విధాన జ్ఞాన సఙ్కల్పోబన్ధః

యజ్ఞ వ్రతము, తపము దానములు మున్నగు విధి విధానముల సంకల్పములు కూడా బంధము. ఇవన్ని చేయుట వల్ల పుణ్యాపుణ్యములు కలుగునని వాటిలోని నియములకు భంగము కల్గకుండ చేయుట కూడా అవి బంగారు సంకెళ్ళే. అవికూడా బంధమే. **కం॥ పురుషోత్తముడని పూజనొనరించెదరు భువిని నానా చోట్లన్। ధర మొదలగు భూతములను చిరుత శిశువు లాడు కొనెడి చేష్టల రీతిన్ ॥**

ప్రపంచమున అనేకులు పృథివ్యాది పంచభూతములను పరుషోత్తముడని పేరు పెట్టి పామర జనులు పూజించెదరు. వీళ్ళ లక్ష్యముచూడ చిన్న పిల్లలు బొమ్మలచే ఆడుకొను నడతల విధముగా తెలియచున్నది. ఎట్లనగా అచల పరిపూర్ణ స్థితి గల శ్రీ కృష్ణ పరమాత్మ పురుషోత్తమప్రాప్తి యోగములో క్షరాక్షర పురుషుల స్పర్శ యంటక అతీతముగా నుండు పురుషుడని నిర్ణయించినారు. కనుక సూరి జనులకు పరిపూర్ణ భావజ్ఞులే పురుషోత్తములుగాని పంచ భూత సముదాయమునందు తెలియచున్న ఎరుక నిర్మితములగు విరాట్టు, హిరణ్య గర్భ అవ్యాకృత ఈశ్వరులు పురుషోత్తములు గారు. వారిని పూజించుటలో నియమ నిబంధనలు పాటించుట, దానము ధర్మము, యజ్ఞము లందు విధి విధానములు పాటించి చేయవలెననెడి సంకల్పములు బంధములే. వీటి విధి విధానములవల్ల దేవ లోకమందు శాశ్వత సుఖములు ఆనందములు పొంద వచ్చుననెడి ఆశచే వాటిని చేసి భ్రాంతి పరులగుచున్నారు. వీరు కూడా "క్షీణే పుణ్యే మర్త్యలోక విశంతి" యని న్యాయమున మళ్ళీపుట్టువారలే. ఇట్టి సంకల్పములుండుట కూడా బంధమే.

### 9. కేవల మోక్షాఽపేక్షా సఙ్కల్పో బన్ధః

ఇతర కోరికలు లేక కేవలము మోక్షాపేక్ష కలిగియుండడము కూడా బంధము అని ఈ ఉపనిషత్తు నొక్కి చెప్పుచున్నది. మోక్షమనె మాటకు కొందరు ముక్తి, కైవల్యము, నిర్వాణము, నిరతిశయ సుఖావిర్భావము అనుమాటలు ఉపయోగిస్తున్నారు. బంధ మోక్షములు, లేక బంధ విముక్తులు సాపేక్షకములు. ముక్తి సాలోక్య, సామిప్య, సారూప్య సాష్టిత్వ, సాయుజ్యముక్తులు అని పంచ విధములగు ముక్తులు చెప్పబడుచున్నవి. ఈ ముక్తులు విష్ణువు శివుడు మొదలగు యిష్టదైవముల లోకములు సామీప్యాదులు పొందుట యని అర్థమునే నిచ్చును. కాని మోక్ష శబ్దమునకు విడుదల, విడుపు అర్థములో ఈ సాలోక్యాదులు అర్థవంతములు గావు. " తృణాది బ్రహ్మ పర్యంతం బంధమున చిక్కి యున్నదనియు, బ్రహ్మమే బంధమున కత్యంతమూల కారణమని" తెలుసుకొన్నాము. అందుకే మోక్షమంటే ఈ మొత్త సృష్టి, సృష్టి కారణమగు బ్రహ్మమును అతిక్రమించి పోవుట యే నిజమగు విడుదల. అదియే జన్మకు యెన్నడు తిరిగి రాని పద్ధతి. అత్యంత దుఃఖనివృత్తి నిరతి శయానంద ప్రాప్తి తానున్నాననే వానికే. నేను తాను అనరానిదాని యందు పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఆనందము లేదు. దుఃఖములేదు. ఏది వున్నా

అది బంధమే కాని మోక్షము కాదు. సర్వము మనస్సే శ్లో॥ **శృణుష్వ విద్వన్, మనఏవజీవో, మన ఏవ విశ్వం, మన ఏవఈశః మన ఏవ మాయా మన ఏవ బంధో। మనోలయే ముక్తిరయం యదార్థః** – జీవన్ముక్తి ప్రకాశిక

తా॥ మనస్సే జీవుడు, మనస్సే విశ్వము, మనస్సే ఈశ్వరుడు, మనస్సే మాయ, మనస్సే బంధము, మనస్సులయ మైనచో ముక్తి, యిది యదార్థము. ఇట్టి మనస్సు ఏ స్థానమందు లేకుండా చేయుటయే అమనస్కము. మనస్సు నేకాగ్రపరిచిన మనోనాశము గాదు. మనస్సు గాని, దాని అధిష్ఠాన మగు ఆత్మగాని పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనే లేదని ఆరూఢత నందిన వానికి అనుభవించునది లేదు. కనుకనే అనుభవమే యుళక్కియగు చున్నది. తానే లేడు. ఇట్టి ఆరూఢతతో యేకార్యములు జేసిన చేసియు చేయని వాడగుచున్నాడు. ఇది యే నిజమగు కర్తృత్వత్యాగము. కర్మత్రయము మారీతిగా నశించిపోవుచున్నది. కనుక వేయించిన విత్తనము మొలకెత్తనట్లు జన్మరాహిత్యము సిద్ధించును. కనుక జనన మరణములు లేకుండ చేసుకొనుటయే మోక్షము. సాలోక్య సారూప్యాది మోక్షములు గావు. అట్టి మోక్షములు కావలయుని సంకల్పించుట బంధము.

**10.సఙ్కల్పమాత్ర సమ్భవో బన్ధః**

సంకల్పమాత్రమున సంభవించిన దంతయు బంధమే. పరబ్రహ్మకు సంకల్పము కలగడమే బంధము. ఆ సంకల్ప మే జ్ఞాన రూపము. ఆ సంకల్పమే జన్మ, ఆ సంకల్పమువలన కలిగిన చలనమే ప్రాణము. ఆ ప్రాణ శక్తి యొక్క పనియే కర్మ. కనుక జ్ఞానము, సంకల్పము, జన్మ, చలనము, ప్రాణము, కర్మ యివన్నియు ఒకే బ్రహ్మమునకు ఒకే సంకల్పముతో ఒకే కాలములో యేర్పడుచున్నది. కనుక జ్ఞాన కర్మలు బ్రహ్మ సంకల్పము వలననే సంభవించినవి. అవి బ్రహ్మమునందు అనాదిగా నుండుటచే బ్రహ్మమే బంధము. **యాదృశి భావానా యత్ర తాదృశిభవతి నిశ్చయం** అను రీతిగా సంకల్పములు కలుగుతునేవుంటాయి. నిర్మలమనస్సుతో కోరిన కోరికలు తీరును. అవి సంభవించును. అట్లు కోరుట, అవి ఫలించి ఫలరూపము పొందుట కూడా బంధమే అంటున్నది ఈ మంత్రము, కనుక అన్ని సంకల్పములను నీ క్షేమము అంటే జన్మరాహిత్యముకొరకు విడువ దగినవే.

**క.ప. 73. ఇచ్ఛారాహిత్యం బనె స్వచ్ఛంబగు బోధయనుచు॥ సజ్జనులనిరి॥ యిచ్ఛనె కూడని దనిరా॥ స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా॥** అని శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారు సెలవిచ్చియున్నారు. శ్రుతి ॥ సంకల్పమాత్ర సంభవో బంధః అని అక్షర పురుషనిర్ణయము. మోక్షాపేక్షా సంకల్పోబంధః" యని క్షరపురుష నిర్ణయముగా నున్నందున కోరిక రహితమైన మార్గము శ్రేష్ఠమని స్వచ్ఛందులగు సత్పురుషులు నిర్ణయించినారు. ఇచ్ఛవలననే జనన మరణములు కలుగుచున్నవి. కనుక కోరిక మంచిది గాదని, అశ్వాశ్వతమని నిర్మల హృదయముల నిర్మల వాక్యంబులు సత్యమైనవని భావము. మరియు క.ప. **74 ఏ యాపేక్ష జనించిన। నాయాపేక్షలెల్ల మాయ। యని తెలియదగున్ అయాసమౌనుదానను। ధీయని విడువదగును। క్షేమము కొరకై ॥**

ప్రపంచ పారమార్థిక కోరికలు ఛ్ఛాయనే గనుక జన్మ బంధమని నిర్ణయము.

అందువలన జనన మరణ రూప భ్రమ అధికమగును. గనుక నీక్షేమము కొరకై సకల కోరికలు కర్తృత్వరహితముగా విడుమని భావము.

**మం. శ్లో॥ మోక్ష ఇతిచ, నిత్యా నిత్య వస్తువిచార దనిత్య సంసార సుఖదుఃఖ విషయ సమస్త క్షేత్ర మమతాఽ ది సమస్త బన్ధ సఙ్కల్ప క్షయోమోక్షః, ఉపాస్య ఇతిచ, సర్వ శరీర చైతన్య బ్రహ్మప్రాపకో గురు రుపాస్యః, శిష్య ఇతిచ, విదాధ్వస్త ప్రపంచాఽ స్యఃవ గాహిత జ్ఞానా2విశిష్టం బ్రహ్మైవశిష్యః - 9.**

తా॥ నిత్యా నిత్య వస్తువిచారణచే అనిత్యము లైన సంసార దుఃఖవిషయములను సమస్త వస్తువులందున్న మమకారబంధ సంకల్పక్షయమే మోక్షము. సర్వజీవుల శరీరములందున్న చైతన్య బ్రహ్మము పొందించు గురువు ఉపాసింపదగినవాడు. విద్యచేత తన కంటే వేరగు జగత్తు అంతయు అదృశ్యమగునపుడు తన కంటే వేరైన వస్తు వెద్ది యునులేక తానొక్కడుగానే మిగిలి యుండుటవలన (మిగిలియున్న) శిష్యుడగు వాడే శిష్యుడు.

**31. మోక్ష ఇచిత = ఇది మోక్షము.**

నిత్యానిత్యవస్తు విచారణచే అనిత్యములైన సంసార దుఃఖవిషయములగు వస్తువులందును మమకార బంధసంకల్ప క్షయమే మోక్షము. నిత్యా నిత్యవిచారణ జేసిన నిత్య మైనది, సత్యమైనది, శాశ్వతమైనది, నిరాలంబం ఒక్కటే. నాతో సహా. నేనైనబ్రహ్మను, సమస్తము ఇంద్రజాలములో తోచు వస్తు సముదాయము వంటిదే. సంసార సుఖదుఃఖ విషయ సమస్తక్షేత్రములందు మమకారము కలిగి దృశ్యమానమగు నదంతయు నిరాబంబమున లేనివే. కనుక అవి అనిత్యములని ఎవడు దృఢముగా నమ్మునో వానికే జన్మరాహిత్య రూప మోక్షము. ఇతరుల కిది ఎండమావులలో జలము వంటిదే. గురు ముఖంగా నిరాలంబ దర్శన భాగ్యము గలిగిన ఎరుక తనంతకు తానే లేకుండా పోవును. కనుక యెరుక యందున్నానే భ్రాంతి వదలి నాకు నిరాలంబమునందు మూలము లేదు స్థానము లేదని దృఢ మైనచో అఖండానుభవ రహితమై జన్మకు రాని మోక్షము సిద్ధించును, తిరిగి జన్మకు వచ్చె మోక్షము గాని, తక్కిన ముక్తులన్ని మోక్షము గాదు. 'తన్నివృత్తిర్మోక్షః నేనను యెరుక లేక పోవుటయే శాశ్వత జన్మరహిత మోక్షమని పై శృతి వాక్యమున కర్థము.

**32. ఉపాస్య ఇతిచ = ఉపాసింపదగినవాడు** సర్వశరీరస్త చైతన్య బ్రహ్మప్రాప కోగురురుపాస్యః, సర్వ జీవుల శరీరములందున్న చైతన్య బ్రహ్మను ప్రాప్తింపచేయు గురువు ఉపాసింపదగినవాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సకల జడా జడ స్వరూపములో "గురోరన్యం నవిద్యతే" గురువు కన్న అన్యమగు జ్ఞేయవస్తువెద్దియు లేదు. గురుసాక్షాత్పరబ్రహ్మ కనుక తానున్నా యాగురు స్వరూపుడే. కాని విస్మృతి వల్ల తన స్వరూపము, మరిచనవాడు. అట్టి స్వస్వరూప జ్ఞానమును అపరోక్షము గావించు వానిని తప్పక పూజించవలయును సేవించవలయును. గుర్మోఖేన జ్ఞాతవ్యం నాన్యదా గ్రంథ కోటిభిః॥ కోటి గ్రంథము చదివిన

లభించని బ్రహ్మ జ్ఞానము ఒక్క గురువు వల్ల లభించును.

శ్లో॥ "తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతితే జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ - భ.గీ.

కావున సద్గురో పాసన రాజమార్గము. గురుదీక్షయే శక్తి పాతము. అందుకే గురుగీతయందు పార్వతీదేవి యడిగిన శ్లో॥ యస్యదేవే పరాభక్తిఃయథా దేవే తథా గురౌ। తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః అని మహాదేవుడు జవాబుచ్చినాడు. అందుకే గురు గీత చరమశ్లోకము.

181 శ్లో॥ యస్యప్రసాదా దహమేవ సర్వం। మయ్యేవ సర్వం పరికల్పింతంచ। యుద్ధంతి విజానామి సదాత్మరూపం। తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యమ్॥ అనగా నేనే సర్వమగుచున్నాను. నా చేతనే సర్వం కల్పింప బడినదనియు, ఆరూఢ జ్ఞానము గల్గుటకై నిత్యము సద్గురు పాదములను కొల్చెదను. అని ప్రవచించున్నది.

శ్రోత్రీయ బ్రహ్మ నిష్టుడను, ఆరూఢ జ్ఞానియగు గురుమూర్తిని పూజించుటవల్ల పూజనీయుని సల్లక్షణములన్నియు పూజించు వాడు తప్పక పొందును.

**33. శిష్య ఇతిచ = ఇతడు శిష్యుడు**

**శ్లో॥ గురు మూర్తింస్మరేనిత్యం । గురోర్నామ సదాజపేత్,**
**గురోరాజ్ఞాం ప్రకుర్వీత। గురోరన్యన్న భావయేత్ ॥ గు.గీ - 117**

ఎల్లప్పుడు సద్గురు స్వరూపునే స్మరించవలయును. ఆ సద్గురు నామమునే జపించువాడు. సద్గురు ఆజ్ఞప్రకారమే చేయువాడు ఇతరమగు దానిని తలంచనివాడు. అట్టి వాడు శిష్యుడు. స్వయం తీర్ణః పరాంతారయతి అనే న్యాయంగా తాను సర్వ భ్రాంతి రహితము చేసుకొన్న తరువాత తత్ప్రాధి పతి ద్వారా బోధాధికారము పొంది కేవలం లోకసేవయే పరమార్థంగా ఎంచి బోధ చేయుటకు ప్రయత్నించువాడే నిజమైన శిష్యుడు.

**మం. విద్వానితిచ, సర్వాన్తరస్థ, స్వసంవిద్విద్వాన్, మూఢ ఇతిచ, కర్తృతాఽ ధ్యహంకార భావనారుఢో మూఢః, అసుర ఇతిచ, బ్రహ్మ విష్ణీశానే న్ద్రాదీనా మైశ్వర్య కామనయా నిరసన జపాఽ గ్ని హోత్రాది ష్వనరాఽ త్మనం సన్తాపయతి చాత్యుగ్ర రాగ ద్వేష హింసా దంభాద్య పేక్షితంతపం అసురమ్ -10**

తా॥ విద్వాంసుడు ఎవడు? బ్రహ్మ మొదలు గడ్డిపరక వరకునుగల సర్వమున్నందు గల స్వరూపమగు జ్ఞాన స్వరూపమును తెలిసినవాడే విద్వాంసుడు. మూఢుడనగా ఎవడు? మనుష్యాది శరీరమునందు వర్ణములయందును ఆశ్రయములయందును కర్తృత్వ భోక్తృత్వాదులయందును అహంకారభావన నధిష్టించినవాడు మూఢుడు. ఏది అసురము. చతుర్ముఖ బ్రహ్మను విష్ణువు ఈశానుని, దేవేంద్రుని ఉద్దేశించి భోగైశ్వర్యములయందలి కోరికను సాధించుటకు ఉపవాసముచేతను, జపముచేతను, అగ్ని హోత్రాదులచేతను, అంతరాత్మను తపింపజేయుచు, అత్యుగ్రరాగద్వేష హింసాదంబాదులతో ఆచరించు అపేక్షాసహిత తపస్సు అసురము.

**34. విద్వానితిచ = అతడే విద్వాంసుడు**

అచల పరిపూర్ణభావజ్ఞులు ఆత్మకు అతీతమైన కేవలాత్మ - నిరాలంబమును అపరోక్షము గావించు కొన్నివాడే విద్వాంసుడని నిర్ణయించినారు.

**శ్లో॥ అచలమేవ సత్యం నిరంజనం నిర్వికల్పం**
**పరాత్పరం బాహ్యముపైతి విద్వాన్**
**అన్య జ్ఞానం భ్రాంతి వృద్ధి ప్రయాతి**

**యేవం జ్ఞాత్వా జన్మరాహిత్య మశ్నుతే॥** అనగా అచలం-చలము, సత్యాసత్యములు, అంజన నిరంజనము, సవికల్ప నిర్వి కల్పాదులు యిత్యాదులన్నియు ద్వంద్వములు, సాపేక్షికములు, నిరాలంబం ఒకటే నిర్ద్వందము, నిరపేక్షకము, పలుకన కందనిది కనుక ఈ ద్వంద్వములలో దేని చేత సూచింపరానిది. సచ్చిదానంద బ్రహ్మము సర్వమునై యున్నందున సర్వద్వంద్వములు ఇదే. కనుక అచలము సత్యము నిరంజనము, నిర్వికల్పము పరము అయివున్నది. ఈ పరమునకు పరమై యున్నందున పరాత్పరమని బ్రహ్మమని నిరాలంబమని, పరబాహ్యమని చెప్పబడుచున్నది. పరిపూర్ణ బోధజ్ఞులైన పండితులచేతనే సమీపింపదగినది. ఏలననగా పరిపూర్ణము తెలియబడునది అని గాని, తెలియరానిదని గాని చెప్పుటకు వీలు లేనిది. కనుక ఉపైతి అని మాత్రము చెప్పబడినది. విద్వాన్ అనే మాటకు శాస్త్ర పండితుడని అర్థ కాదు. " పాండిత్యం నిర్విద్యా" అని శృతి. విద్యావిద్యలకు రెండింటికి అతీతమైన నిర్విద్యాస్వరూపమే నిరాలంబం, పరిపూర్ణం, గురూపదిష్ట మార్గమున అనగా లేనెరుకతో దానిని కనిపెట్టినవాడే పండితుడు. చూస్తేనే ఎరుక పారిపోవునురా। అని అన్నారు శ్రీకృష్ణదేశికులు చూచిన అతడున్నూచెప్పజాలడు. ఇతరమైన మార్గములచే భ్రాంతి అధికమగునుగాని జన్మ రహిత విధానము గాదని తెలియవలయును. పరిపూర్ణ పండితుడు మృత్యువునకే మృత్యువు.

**35. మూఢ ఇతిచా = ఇతడే మూఢుడు.**

మొదట అహంకారమును గురించి తెలుసుకొందుము. ఆ బ్రహ్మయొక్క పరిణామ దశల యందు బ్రహ్మము వల్ల అవ్యక్తము, మహదహంకారము పరిణమించినది. సమస్త సృష్టికి తానే కర్తను భోక్తను అని అభిమానించుటయే మహదహంకారము. అదే విధంగా అంతరేంద్రియములలో వ్యష్టి అహంకారము చివరిది.

దీనికి అధిష్ఠానదేవుడు రుద్రుడు, అభిమానించుట అధి భౌతికము, శరీరములందు అహంకారములు అధిష్ఠువాడు మూఢుడు.

జీవతనువులైన స్థూల, సూక్ష్మ, కారణ శరీరము, మహాకారణశరీరములలో స్థూల శరీరముతో తాదాత్మ్యము చెంది ఒకడు అహంకారముతో నేను తెల్లగావున్నాను, బలంగా వున్నానని, సూక్ష్మశరీరముతో తాదాత్మ్యము చెందినపుడు నేను సుఖిని, దుఃఖిని అని, కారణశరీరముతో తాదాత్మ్య చెందినపుడు నాకేమితెలియదని, చివరకు నేనే బ్రహ్మను అని మహాకారణ శరీరముతో తాధాత్మ్యముచెంది అహంకారముతో అంటున్నాడు గాని లోకవ్యవహారములన్ని బ్రహ్మ భావనలో వుండి చేయుటలేదు. ఇట్లు తన

శరీరాభిమానముతో నుంటు పలుకుచున్నాడు. ఎందుకనగా అవిద్యవల్ల తన వునికి పరిపూర్ణమునందు (నిరాలంబము) నందు మృషయని యెరుగడు, ఇది గురు రహస్యం.

ఇక వర్ణములు అనగా కులములు, బ్రహ్మణ, క్షత్రీయ, వైశ్య, శూద్రకులములని మరెన్నో కులములున్నవి. ఆశ్రమము లందును – బ్రహ్మ చర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్తము, సన్యాసాశ్రమము లందును, వానిలో యున్నను కర్తృత్వ భోక్తృత్వములందు అహంకారముతో నుండు వారు మూడుడు.

### 36. అసుర ఇతిచ = వీరే అసురము

బ్రహ్మను, విష్ణువును, శివుని, దేవేంద్రుని గూర్చిఘోరమైన తపస్సులు జేసిగాని, యజ్ఞయాగాదులు జేసి గాని వారిని మెప్పించి భోగములు ఐశ్వర్యములు అనుభవించుటకు వరములు పొందుతారు. ఇట్లు అపేక్ష కలిగి అహంకారమున వరములు పొందిన వారినే నాశనముజేసి తానాపదవి అలంకరించవలయుననేడి తప్పుడు చూపుగలవారు. వారులోక కంఠకులై చేయరాని దుష్కృత్యములు జేయుదురు. వారు నీచయోను లందు జన్మిస్తారు. జన్మరాహిత్యము వారికి ఎండమావియే. అట్టిది అసురము.

**వ౦. శ్లో॥ తపఇతిచ, బ్రహ్మ సత్యం జగన్మిథ్యే పరోక్ష జ్ఞానాగ్నినా బ్రహ్మాద్యైశ్వరా2 శాసిద్ధ సఙ్కల్పబీజ సంతాపరూపం తపః. పరమపద మితిచ. పాణేంద్రియా2 ద్యతః కరణ గుణాదేః పరతరం సచ్చిదానంద మయం సర్వసాక్షికం నిత్యముక్త బ్రహ్మస్థానం పరమం పదమ్. గ్రాహ్యమితిచ, దేశ కాలవస్తు పరిచ్ఛేద రాహిత్య చిన్మాత్ర స్వరూపం గ్రాహ్యయ్. అగ్రాహ్యమితిచ, స్వస్వరూప వ్యతిరిక్త మాయ మయ బుద్ధీంద్రీయ గోచరజగత్సత్యత్వచిన్తన మగ్రాహ్యమ్. సన్యాస ఇతిచ, సర్వధర్మాన్ పరిత్యజ్య, నిర్మమో నిరహంకారో భూత్వాబ్రహ్మేష్టం శరణ ముపగమ్య తత్వమసి సర్వఖల్విదం బ్రహ్మ, నేహనా నాஉస్తికించ వేత్యాది మహావాక్యార్థాஉనుభవజ్ఞానా ద్బ్రహ్మైవాஉహమస్మీతి నిశ్చిత్య నిర్వికల్ప సమాధినా స్వతంత్రోయతిశ్చరతి సన్యాసి సముక్త సపూజ్య స్సయోగీ సపరమ హంసస్సోஉవధూత స్స బ్రహ్మణఇతిచ (11)**

బ్రహ్మాదుల ఐశ్వర్యమందలి ఆశచే సిద్ధించిన సంకల్ప బీజమును బ్రహ్మ సత్యము జగత్తు మిథ్య అను ప్రత్యక్ష జ్ఞానమును జ్ఞానాగ్నిచే ఎండింపజేయుట తపము. ప్రాణములు, ఇంద్రియములు, అంతఃకరణము దాని గుణములు మున్నగు వాటికంటే పరతరమును సచ్చిదానంద మయమును, నిత్యముక్తమగు బ్రహ్మస్థానమే పరమపదము. దేశ కాల వస్తుపరిచ్ఛేదము లేని చిన్మాత్ర స్వరూపమే గ్రాహ్యము. సస్వరూప వ్యతిరికమైన మాయామయమగు బుద్ధీంద్రియములకు గోచరమైనదగు సత్యమను చింతనము గ్రహింపదగినది కాదు. ఇది అగ్రాహ్యము. ప్రాపంచిక విషయములనెల్ల పరిత్యజించి, నిర్మలుడు, నిరహంకారుడై, తమ కిష్టమగు బ్రహ్మమును శరణు జొచ్చి తత్వమసి, అహం బ్రహ్మాస్మీ, సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహనా உ నాస్తి కించన మొదలైన మహావాక్యములయొక్క అర్థమును అనుభమునకు తెచ్చుకొనుటవల్ల నేను బ్రహ్మనే యగుదును అని నిశ్చయముగా నెరిగి నిర్వికల్ప సమాధితో కూడి స్వతంత్రుడై యతి సంచరించుచుండును. అతడే సన్యాసి,

అతడు ముక్తుడు, అతడే పూజ్యుడు, అతడే యోగి, అంతడే పరమ హంస, అతడే అవధూత, అతడే బ్రాహ్మణుడు.

**37 తపమితిచ = ఇది తపము.**

"బ్రహ్మ సత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవనాపరః" అనీ సర్వఖలిద్వం బ్రహ్మయని, నే హనా నాఽస్తి కించన అని. అస్తం భపర్యంత పరమాత్మ స్వరూపకమని ఈ ఉపనిషత్తునందే ఈ మంత్రమునందే పేర్కొనబడి బ్రహ్మ సత్యం జగత్తు మిథ్యయనుట పరస్పర భావవిరుద్ధముగా నున్నది. పరిపూర్ణభావజ్ఞులు బ్రహ్మ, జగత్తు రెండును సత్యములని గాని లేదా అసత్యములని గాని అనవలెనడి అభిప్రాయము గలవారు. ఇకజ్ఞానాగ్నిని గురించి చెప్పవలిసివస్తే జీవ బ్రహ్మైక్యమే జ్ఞానాగ్నియందురు. జీవుడు బ్రహ్మము కలిసేవున్నారు. మరొకమారు కలియుటను 'కంఠచామి కరవత్' అని చెప్పుచున్నారు. అనగా హారము మెడతోనే యున్నను హారము కొరకు వెదుకులాటవంటిది అని నిర్ణయము. కనుక జీవహైక్యము జ్ఞానాగ్నికాదు. దాని వల్ల కర్మఫలములన్ని నాశనముగావు. అగామి మిగిలియేయుండును. ఇట్టి జ్ఞానాగ్నిచే సంకల్ప బీజమును ఎండింప జేయుట తపము అన్నారు. గాని నిరాలంబం నందు ఎరుకకు స్థానము లేదు. మూలము లేదని దృఢముగా నమ్మి ఎరుకను వదిలి కర్తృత్వరహితముగా కర్మాచరణ జేసి శేషజీవితము గడిపిన వేయించిన విత్తనము మొలకెత్తనట్లు తిరిగి జన్మరాదు. త్రివిధ కర్మ ఫలములు నశించును. ఇట్లు ఎరుకను ఎండింపజేయుటయే తపము.

**38. పరమ పద మితిచ = ఇది పరమ పదము.**

**శ్లో॥ స్వయం బ్రహ్మ మయోభూత్వా। తత్పరం బావలోకయేత్।**
**పరాత్పర తరం నాన్యత్। సర్వగం తన్నిరామయం॥ గరు గీత - 212**

తా॥ జనుడు తాను బ్రహ్మస్వరూపియై ఆ పిమ్మట దాని కతీతమైన పరస్వరూపమగు కేవలాత్మ (నిరాలంబం) జూచుచును. అట్టి పర స్వరూపమగు నిరాలంబం కంటే అన్యమేదియు లేదు. అది అంతట నిండియున్నది. నిరామయిమై యున్నది. అది దేనికి ఆధారము గాదు అని స్పష్టంగా జెప్పుచున్నది ఈ గురుగీతాశ్లోకము. ప్రాణములకు, ఇంద్రియములకు, అంతఃకరణమునకు పరతరమగు సచ్చిదానంద బ్రహ్మము నిత్యముక్తమైనది గాదు. ఆ సచ్చిదానంద బ్రహ్మమే బంధమునకు అత్యంత మూలకారణమని వెనుక పుటలయందు తెలుకొన్నాము. అలాంటప్పుడు ఎరుక బ్రహ్మమే నిత్యముక్తము, శాశ్వతము, దానికంటే అన్యమేమి లేదని నమ్మినచో వాడు భ్రాంతిలో మునిగి జనన మరణ మనే చక్ర భ్రమణమందే తిరగుచుండును. ఆ ఎరుక బ్రహ్మము పరమ పదముగాదు. ఆ ఎరుక బ్రహ్మమును గురు కృపచే తానే నని తెలుసుకొని, తన కంటే (నేనైన బ్రహ్మకంటే) అన్యమైన నిరాలంబంను దర్శించి సర్వ భ్రాంతులు రహిత పరచుకొన్నవానికి తిరిగి జన్మకురాని జన్మ రాహిత్య మోక్షము సిద్ధించును. ఇదే పరమపదము, నిరాలంబమే పరమ పదము.

క.ద॥ 43 పరమ పదమనిన బయలన । గురుగుహ్య మనంతమనిన॥ గోప్యంబనినన్॥ పరిపూర్ణమచలమనినను । తిరమనగా బట్టబయలు తెలియు మాయప్పా॥ యీ తెలిసీన తెలివి మానప్పా ।....."

**39.** గ్రాహ్యమితిచ = ఇది గ్రహించదగినది

అధిష్ఠాన చేతన బ్రహ్మమే గ్రహింపదగినది. ఎరుక బ్రహ్మము, మాయ బ్రహ్మలు వేర్వేరు కావు. బ్రహ్మ వల్లనే మాయ, గనుక రెండు ఒకే నాణెమునకు బొమ్మ బొరుసు లాంటివి. గ్రాహ్యగాని బ్రహ్మము నిరాలంబం. ఇందుకు ప్రమాణంగా వేమన పద్యములోని ఒక చరణమును పరిశీలింతము. బ్రహ్మమడగకున్న బ్రహ్మంబుగన రాదు" అంటే ఎరుక, సచ్చిదానంద బ్రహ్మమును వదలకుండగ నిరాలంబమును గ్రహించ లేమని స్పష్టపరచబడినది. కనుక బ్రహ్మమే గ్రాహ్యమని దిగువన పేర్కొన బడిన మరి కొన్ని శ్రుతులను పరిశీలింతము.

**శ్లో॥ ఏషు సర్వేషు భూతేషు గూఢోత్మానప్రకాశతే**
**దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥** కఠోపనిషత్తు.

తా॥ అతీంద్రియమగు బుద్ధిచే ఈ బ్రహ్మముగ్రహింపదగియున్నది. అనగా బుద్ధీంద్రియమునకు నిశ్చయా నిశ్చయములు ఆదిభౌతిక వ్యాపారమై యున్నది. ఈ వ్యాపారము వదిలినచో ఆ బుద్ధియే అతీంద్రియమనబడి ఈ బ్రహ్మమును గ్రహింప సమర్థకమగుచున్నది.

శ్లో॥ **ఆత్మవా2రే ద్రష్టవ్యో శ్రోత్రవ్యో॥ మంతవ్యో నిధి ధ్యాసితవ్యః॥** బృహదారణ్యకోపనిషత్తు. ఆత్మయే చూడ దగినది. వినదగినది ధ్యానముచే పొందదగినది అనగా మనస్సుచే తెలియ దగినది గానున్నది.

**40.** అగ్రాహ్య మితిచ = ఇది అగ్రాహ్యము

దిగువ శ్రుతులు నిరాలంబం అగ్రాహ్యమని చెప్పుచున్నవి. పరిశీలింతము.

**శ్లో॥ నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగచ్ఛతి, నోమనః, నవిద్మోనవిజానీయో, యథైత తదను శిష్యా దన్య దేవ తద్విదితాదధో అవిదితాదధి యతి శుశ్రుమ పూర్వేషాయేన స్తద్వ్యాచచక్షిరే॥** కేనోపనిషత్తు.

తా॥ వాక్కుకు అందదు! మనస్సుకు చక్షువునకు అందదు. జ్ఞానమునకు కూడా తెలియరానిది ఏదో అది తెలియని దాని కంటేను, తెలియరాని దాని కంటెను వేరుగా నున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యులకు ఉపదేశించిరి. (అదే నిరాలంబం)

**శ్లో॥ నైవవాచా నమనసా ప్రాప్తుంశక్యోన నచక్షుషా అస్తీతి బ్రువతోన్యత్ర కథం తదుపలభ్యతే॥ కఠోపనిషత్తు॥**

తా॥ వాక్కుమనస్సు చక్షువులకు పొప్తింపరానిది. ఉన్నదని చెప్పుటకు వినా మరొక రీతిగా దాని యుపలబ్ధి కాజాలదు.

యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ ॥ తైత్తరీయ॥

మనసు వాక్కుదేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది నిరాలంబం అది గ్రహింపరానిది.

కనుక అధిష్టాన చేతన బ్రహ్మము, ఎరుక బ్రహ్మము గ్రాహ్యము, నిరాలంబం, పరిపూర్ణపరబ్రహ్మము అగ్రాగాహ్యమని గమనించవలయును.

**41. సన్యాసి ఇతిచ = ఇతడు సన్యాసి**

ప్రాపంచిక విషయమునెల్ల పరిత్యజించి, ఈ ప్రపంచము, దానిని సృష్టించిన బ్రహ్మ విషయములన్ని వదుల వలయును. ఎందుకనగా జీవుడు, జీవుడు వసించు ప్రపంచము రెండు బ్రహ్మమే. బ్రహ్మమే సృష్టి కారణమని సర్వాంగీకారమైన విషయమే. పంచభూతములున్ను కలసి షట్కోములు. లేక షడావర్ణములు రూపుచెంది ఎరుకే ఈ జగమయ్యేనన్నారు. కనుక ఎరుకనగా శుద్ధ జ్ఞానము యొక్క మారు రూపమేజగత్తు. కనుక సర్వం ఖల్విదంబ్రహ్మ "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" ఏకమనేకం భవతి, ఇత్యాది శ్రుతులలోవున్న బ్రహ్మ శబ్దమునకు పర్యాయపదముగా అచ్చతెనుగులో ఎరుక అనే శబ్దము వాడినారు. కారణరూపముగా నున్నయెరుకే కార్యరూపమగుజగత్తు, కార్యకారణములుగా అధోయూర్ధ్వ పరిణామములు చెందువస్తువును ఇతరులు బ్రహ్మమన్నారు. పరిపూర్ణులు ఎరుకన్నారు. ఈ ఎరుక నానాత్వము చెందుచున్నది. ఎరుక యందు స్వగత భేదమున్నది గాని సజాతీయ భేదంలేదు. అంతా ఏకమే. కనుక సజాతీయ భేదమును పరిపూర్ణులు అంగీకరించిరి. ఈ భావముతో పోల్చిన ఎరుకను త్యజించవలసియున్నది. ప్రాపంచిక విషయములు త్యజించిన వ్యష్టిరూప ఎరుక నశించగా సమిష్టిలో ఎరుక నిలిచియుండుట తిరగి జన్మకు కారణమగును. "ఎరుకొక్కటుండెనేని ఎరుకే ఈ విశ్వరూప ఏర్పడదాల్చున్"॥ అన్నారు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. కావున ఎరుకనే పరిత్యజించ వలయును ఈ దృష్టి కోణముతో దిగువ అంశములు పరిశీలించవలెను.

**నిర్మలుడు:** అనగా మలము లేనివాడు. మలము అనగా మలినము. మలములుమూడు 1. అణవ మలముః = పరమాత్మ నెరుగక సంసారములో మునుగుట, 2. మాయామలము = పర ద్రవ్యాపేక్షచేత ఇతరులకు కీడుచేయుట, 3. కార్మికమలము జనన మరణ హేతువైన పుణ్యపాపములు చేయుట. ఈ మూడు మలములను వదిలి ప్రవర్తించువాడు నిర్మలుడు, పరమాత్మ కేవలం నిర్మలుడు కాడు. శుద్ధనిర్మలమై యున్న దొక్క నిరాలంబం మాత్రమే.

**నిరహం కారుడు:** అహం వృత్తి లేనివాడు. నేను అనుభావన లేనివాడు నిరహంకారడు. ఇట్టి గుణములు యతికుండును. ఇట్టి వాడుతన కిష్టమగు బ్రహ్మమను శరణు జొచ్చి యుండును. ఇచ్చట తనకిష్టమైన బ్రహ్మను శరణుజొచ్చియుండును అంటే ఇష్టములేని బ్రహ్మము కూడా యున్నదా! అంటే "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనః" అట్లు రూపకగల్పనజేసి కొన్న విష్ణువు ఈశ్వర బ్రహ్మ యింద్రుదు మొదలగు దేవతలున్నారు. వీరు కూడా సృష్టిలోని వారే యని గుర్తుంచుకొనవలసి యుండును. ఇట్టి వారిని శరణుజొచ్చి తత్వమసి, అహం బ్రహ్మాస్మి సర్వం ఖల్విదంబ్రహ్మ, నేహానాఽస్తి కించిన అను మహావాక్యముల యొక్క అర్థమును అనుభవమునకు తెచ్చుకొనును. వాటిని గురించి విచారింతము.

**తత్త్వమసి(బ్రహ్మ:** ఈ మహావాక్యము సామవేదాంతర్గత చాందోగ్యోపనిషత్తు నందలిది. లక్షణత్రయము చేత అనగా జహల్లక్షణ అజహల్లక్షణ, జహదజహల్ల లక్షణముల చేత ఉపదేశక్రమము తెల్పబడను.

**నిర్ణయము:** తత్త్వమసి అనువాక్యమున మూడు పదములు గలవు. 1. **తత** అది, ఈశ్వరుడు, 2. **త్వం**= నీవు, జీవుడు. 3. **అసి**= అయితిని అనగా ఆ బ్రహ్మము నేనైతిని.

## వివరములు

### 1. తత్పదము.

**ఎ) వాచ్యార్థము**= మాయ, మాయ యందలిచిదాభాసము, అధిష్ఠానము= ఇవన్ని చేరిఈశ్వరుడు తత్పదమునకు వాచ్యార్థము.

**ఈశ్వరుని ధర్మములు.** 1. సర్వజ్ఞత 2. సర్వశక్తిత్వము, 3. వ్యాపకత, 4. ఏకత, 5.స్వతంత్రము 6. సమర్థత, 7. పరోక్షత, 8. మాయోపాధి, ఈ యెనమిది ఈశ్వర ధర్మములు.

**బి) లక్ష్యార్థము=** ఈ సర్వ ధర్మములు సహితముగా మాయ, మాయ యందిలి చిదా భాసము, మాయాధిష్ఠాన బ్రహ్మము ఈశ్వరుడు తత్పదము యొక్క లక్ష్యార్థము.

### 2. త్వం పదము

**ఎ) వాచ్యార్థము.** అవిద్య, అవిద్యయందలి చిదాభాసము కూడస్థుడు చేరి జీవుడు త్వంపద వాచార్థము.

**జీవునిధర్మములు** 1. అల్పశక్తి 2. అల్పజ్ఞత 3. పరిచ్ఛిన్నత 4. అనేకత 5.పరాధీనత 6. అసమర్థత 7. అపరోక్షత 8. అవిద్యోపాధి, ఈ ఎనిమిది జీవ ధర్మములు.

**బి) లక్ష్యార్థము**= భాగత్యాగ లక్షణములతో అనగా సకల జీవ ధర్మముల సహితముగా అవిద్యయందలి చిదాభాసమును పరిత్యాగము జేసినచో పరిశేషమైన కూటస్తాత్మయే త్వం పదమునకు లక్ష్యార్థము.

### 3. అసి పదము

అసి పదమునకు అయితిని అని అర్థము. అసిపదము తత్, త్వం పదములకు ఐక్యతను కల్పించును.

తత్త్వమసి అను వాక్యామునకు "అదినీవైతిని" అను వాక్యార్థము. కించజ్ఞత్వ అపరోక్షాది ధర్మములు గల ఈశ్వరుడెట్లగును? కనుక ప్రసిద్ధార్థము వాచ్యార్థము అంగీకరించినచో వాక్యార్థము సమన్వయ మగుట లేదు. విరుద్ధముగల రెండు తత్త్వములకు ఏకమెట్లు పొసగును? పొసగదు. కావున

వాచార్థ విరుద్ధము ప్రసిద్ధమైయున్నందున లక్షణావృత్తిచే విచారించిన నేగాని ఈ విరోధము పరిహారమగును.

మహావాక్యమునన్వయించుపట్లు జహల్లక్షణముగాని, అజహర్ల క్షణముగాని,

ప్రయోజనముకాజాలదు. ఏలననగా జహల్లక్షణముచే తత్పద వాచ్యార్థమైన ఈశ్వరుని త్వం పదవాచ్యార్థమైన జీవునిగాని పూర్తిగా విడిచిన యెడల ఐక్యత ఎవరికి? అపుడు జీవేశుల అసజ్జడ దుఃఖరూప దేహ ప్రపంచములను గ్రహించవలసి యుండును. కనుక జహల్లక్షణము వర్తించదు ?

అజహల్లక్షణమందు వాచ్యార్థమునందు ఏమి త్యాగముగాక పోవుటచే తత్, త్వం పదములందలి విరోదార్థములు పరిహారము గాక యట్లే నిలిచి యుండును. అనగా జీవేశ్వరుల విరుద్ధ ధర్ములైన సర్వజ్ఞత్వ పరోక్ష అపరోక్షములు కూడా విడువబడక పోవుట వలన వాక్యమునకు సమన్వయము కుదురదు. కనుక మహా వాక్యమునందు జహదజహల్లక్షణలము చేతనే పద ద్వయమునకు ఐక్యత సిద్ధించును. ఎట్లనగా 'తత్' త్వం పదములందలి విరోధ భాగమునకు త్యాగమున్ను, అవిరోధభాగమునకు గ్రహణమున్ను అగుట వలన పదార్థము ఐక్యత చేకూరును.

1. కనుక తత్పదవాచ్యార్థమైన ఈశ్వరుని యందు అభాససహిత మాయ, మాయవలన కలిగిన సర్వజ్ఞ సర్వశక్తులను వదులవలెను.

2. అట్లే త్వంపద వాచ్యార్థమైన జీవుని యందు అభాసవహిత అవిద్యాంశములను అవిద్యవలన కలిగిన అల్పశక్తి అల్ప జ్ఞానాది ధర్మములు త్యజించ వలయును.

3. ఇక జీవేశ్వరుల యందలి అధిష్ఠాన చేతనాంశమొక్కటే గ్రాహ్యాంశమైయున్నది. జీవేశ్వరుల యందీ యధిష్ఠాన చేతమే సమాన ధర్మమై యున్నది. సమానమనగా రెండు గాదు. ఏకమేనని తత్వమసి వాక్యము భోదించుచున్నది.

శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు 45వ కందార్థ దర్పనందుయిట్లు వివరించియున్నారు. **"పింద బ్రహ్మాండములు రెండును యా రెంటిలోని రెండహములు యీ। ఖండములు నాలుగు కూడి। అఖండం బగు ఎరుక రూపు। గనరా మా తండ్రి। యిది దెల్పిన ఘనుడే తలిదండ్రి"** అనగా ఆపాదమస్తక పర్యంతము తెలియుచున్న వ్యష్టి ప్రాణము పిండము. దాని యందలి వ్యష్టి మనస్సు అహంఅనీ, మరియు పృథ్వి ఆకాశము వరకు తెలియుచున్న సమిష్టి ప్రాణము బ్రహ్మాండము. దాని యందలి సమిష్టి మనస్సు అహం అని నిర్ణయము. ఈ పిండబ్రహ్మాండములు, వీటి అహములు నాలుగు కూడి అఖండమగు యెరుకయనబడును. ఈ యెరుక యొక్క వాస్తవ లక్షణములను దెల్పేటి సద్గురువే తల్లిదండ్రియని అన్నారు. ఈ భావమునందు

1. పిండము + అందలి అహం = <u>త్వం పదము</u>

2. బ్రహాండము + అందలి అహం = **<u>తత్పదము</u>**

పిండము + అందలి అహం + బ్రహ్మాండము + అందలి అహం= ఈ నాలుగు కలసిన అఖండ రూపే **అసిపదము**. అఖండ ఎరుక స్వరూపము.

వీటిని వస్తు నిశ్చయముగా తెల్పిన గురుడే తల్లిదండ్రి. తత్వమసి వాక్యములో జెప్పబడిన అర్థమునే గాక విశేషముగా అఖండార్థమునే ఈ కందార్థములో జెప్పబడినది. ఎట్లనగా మహావ్యాక్య విచారణలో జహదహదర్లక్షణము (భాగత్యాగ) పద్ధతి చేత తత్, త్వం, అనుపదము లందలి విరుద్ధాంశములను త్యాగము చేస్తేనే మహా వాక్యర్థము అర్థమగును. ఆవిధముగా యే విరుద్ధాంశములను త్యాగము చేయకుండగనే శ్రీకృష్ణదేశికుల వారు అఖండార్థమును ప్రతిపాదించినారు. అంతేగాక పిండబ్రహ్మాండములు కూడితేనేగా అఖండంబగు ఎరుక రూపు గాదని ప్రతిపాదించిరి. పరిపూర్ణ బోధాధికారులు తమ శిష్యులను ఈ విధమును వస్తు నిశ్చయముగా దెలిపి ఆత్మ సాక్షాత్కారము అనగా అఖండ ఎరుక దర్శనము చేయించవచ్చును. ఇదొక మార్గము. అఖండ ఎరుక స్వరూప దర్శనమైననే పరిపూర్ణ దర్శనము చేయించుట చాలా సులభమని గ్రహించగలరని ప్రార్థన.

**అహంబ్రహ్మాస్మి :** ఈ మహావాక్యము యజుర్వేదాంతర్గత బృహదారణ్యా కోపనిషత్తులోనిది. దీనివలన అనుభవము వచ్చును.

అహంబ్రహ్మాస్మి యొక్క నిర్ణయము: అవిద్యకు యోగ్యమైన మానవోపాధి యందు బుద్ధి సాక్షిగానున్న ప్రత్యగాత్మ ప్రకాశము వల్లనే నాది, నేను అను అహం వృత్తి కలుగుచున్నది. అందువలన అహంబ్రహ్మాత్వ నిర్ణయము సిద్ధించుచున్నది. అస్మి అనగా అయితిని అని యర్థము. ప్రత్యగాత్మ అధోపరిణామముజెందుటచే జీవోపాధులందు చేరుచున్నది. బ్రహ్మ నిర్ణయము తెలసి ఉర్ధ్వపరిణామము చెందునపుడు నేను బ్రహ్మనైతిని అను యిట్టి నిర్ణయము సార్థకమగుచున్నది.

**సర్వంఖల్విదంబ్రహ్మ:** తత్పదము, త్వంపదము, అసి పదము, ఆత్మ, అండ పిండ బ్రహ్మాండములు బ్రహ్మము నీవే, సత్తు, చిత్తు, సాక్షిరూపము, క్షరాక్షరములు, క్షేత్రక్షేత్రజ్ఞుడు నీవే. కర్మ జ్ఞానములు, స్థూలము దీర్ఘములు మొదలైన సర్వంనీవేనని తెలుసుకొనుము.

**నేహనానాఽస్తి కించన:** 'ఆ స్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం' అని శ్రుతి. గడ్డి పోచమొదలు బ్రహ్మ పర్యంతం సమస్తము పరమాత్మమే కాని అన్యమేమి లేదు. సకల చరాచరములందు బ్రహ్మ పరా, పశ్యంతి, మధ్యమ వాక్ రూపమున నున్నది కనుక అంతాబ్రహ్మము అన్యమేమి లేదు. నేను (బ్రహ్మము) తప్ప మరొకటి లేదు.

పైన జెప్పిన మహావాక్యముల యొక్క అర్థమును అనుభవమునకు తెచ్చుకొనుటవల్ల వానిని దృఢపరుచుకొనుటవల్ల నేను బ్రహ్మనే యగుదును అని నిశ్చయముగా సన్యాసి నెరుగును అప్పుడు ఆ సన్యాసి సవికల్ప సమాధియుందుండును.

సవికల్పసమాధి అనగా సాధన సంపన్నుడైన అధికారి గురుముఖంబున వేదాంత వాక్య శ్రవణాదులు (మహావాక్య శ్రవణాదులు) చేయుచు తాను బ్రహ్మననే భావించును. ఇదే సవికల్పసమాధి. ఇట్లు ఎల్లప్పుడుంటూ స్వంతత్రుడైయతి సంచరించుచుండును. అతడే సన్యాసి యని ఈ మంత్రము జెప్పుచున్నది. ఇందు సన్యాసి సవికల్పసమాధితో

కూడి స్వతంత్రుడై యుండును అని ఇతరులు జెప్పుదురు. కాని ఈఉపనిష్యత్ లక్ష్యము జన్మరాహిత్య మోక్షము సిద్ధింపజేయుట. కనుక పోవలిసనది నేను బ్రహ్మ నైతిని అనే భావమే. అది మొదటిభ్రాంతి, అచల సాంప్రదాయ సిద్ధాంతము ప్రకారము అతడు బద్ధుడైనాడు ఆ బద్ధత్వమును వదిలినప్పుడే, నాకు నిరాలంబంమున స్థానము లేదు, మూలము లేదునుటవల్ల సర్వ భ్రాంతులు నశించును. అప్పుడే స్వతంత్రుడు, అప్పుడే జన్మరాహిత్యమోక్షము. కనుక పై వాక్యములన్ని ఎరుక చేయు వాక్యములు వాటిని వదిలిన వాడే సన్యాసి, ముక్తుడు, అతడేపూజ్యుడు, అతడు పరిపూర్ణపరబ్రహ్మ భావజ్ఞుడు.

**మ.శ్లో॥ నిరాలంబోపనిషదం యోధీతే గుర్వనుగ్రహత స్సోஉగ్ని పూతోభవతి సవాయుపూతోభవతి, నస పునరావర్తతతే. నస పునరావర్తతే, పునర్నాభిజాయతే పునర్నాభిజాయత ఇత్యుపనిషత్॥ 12 (నిరాలంబోపనిత్సమాప్తా)**

తా॥ సద్గురువుయొక్క అనుగ్రహమువలన ఎవడు నిరాలంబోపనిషత్తును అధ్యయనము చేయునో అతడు అగ్ని పూతుడగుచున్నాడు. వాయు పూతుడగుచున్నాడు. అతనికి పునరావృత్తి కలుగదు పునరావృత్తి కలుగదు, అనికి మళ్ళి జన్మరాదు. అతడు మరల జన్మించడు. అతడు మరల జన్మించడు. (నిరాలంబోపనిషత్తు సమాప్తము)

ప్రపంచమునగల అన్ని సగుణ నిర్గుణ సాధనవల్ల జన్మరాహిత్యము సిద్ధించునని ఫలశ్రుతి చెప్పబడుచున్నది. ఇట్లు చెప్పి రుచి కలిగించుటకే గాని, సాధనల వల్ల భ్రాంతి అధికమగును. మళ్ళి జన్మవచ్చును. అన్నిమత సాంప్రదాయముల గమ్యము బ్రహ్మయొక్క సగుణ నిర్గుణ స్వరూపమైయున్నది. అన్ని మతములు చివరకు ఒకే గమ్యస్థానము చేరునని జెప్పుదురు. ఆకాశము నుండి పడిన వర్షము చివరకు సముద్రమునే జేరును. మరల ఎండకు ఆవిరై వర్షకాలమున భూమిపైననే పడి మళ్ళి సముద్రమునే చేరును. కనుక మతములన్ని తిరగి వచ్చు పద్ధతినే సూచించును. పరిపూర్ణబోధ యొక్కటి మాత్రమే తిరిగి జన్మకు రాని మార్గము. పరిపూర్ణబోధ వలన జన్మరాహిత్యము గలుగును. ఎందుకనగా బోధ సర్వలక్షణ విలక్షణమైనది. అందువల్ల నిరాలంబం సర్వలక్షణ విలక్షణమైనది. అందుండు మార్గము అత్యంత విలక్షణమైనది. దాని అశయము కూడా విలక్షణమే అదే తిరిగి జన్మకురాని పద్ధతి

అన్ని గ్రంధములు, ఉపనిషత్తులు చివర ఫల శ్రుతిని పల్కినవి. అన్నిటివల్ల జన్మరాహిత్యమే సిద్ధించుననియే సూచించినవి గాని, ఎట్లు అది సిద్ధించునో వివరించలేదు. పరిపూర్ణబోధ వాటికన్న విశిష్ఠమైనది. అవి అన్ని జీవ బ్రహ్మైక్యమును సిద్ధింపజేయును. అదే వారు తిరిగి రానిపద్ధతి అంటారు. కాని పరపూర్ణబోధ అట్లు గాక జనన మరణ రాహిత్యము సిద్ధించు విధానము సిద్ధాంతపూర్వకముగా ప్రచుర పరిచినారు.

పరిపూర్ణ భావజ్ఞుడు ఎరుకను అనగా నేను అను వస్తువును సంపూర్ణముగా సమస్తాభిమానములు వదిలినవాడు. ఈ నేను అనువస్తువు వ్యష్టియందు ప్రత్యగాత్మ,

సమిష్టియందు పరమాత్మయే స్వార్థము. అనగా అఖండ యెరుకనే స్వార్థము. పరిపూర్ణ మందు ఈ అఖండ యెరుక లేదనే భావం దృఢమైతేనే గాని వ్యష్టిరూపమగు స్వార్థము పూర్తిగా నాశనముగాదు. కనుక జన్మకారణమగు వస్తువును వస్తుతః గుర్తెరిగి దాని రహితము చేసుకొను జన్మరాహిత్యవిధానము పొందు విధానము ఈ పూర్ణబోధయందే గలదు. ఈసిద్ధాంతము సనాతమైనది. వేదసమ్మతమైనది. సర్వసిద్ధాంతములకు అతీతమైనది. పరిపూర్ణమందు ఎరుక లేదనుటయే భ్రాంతి రహితము, భ్రాంతి రహితమే జనన మరణ రాహిత్యము.

ఎవడు సద్గురు కృపవల్ల ఈ నిరాలంబోపనిషత్తును అధ్యయనము చేయునో వాడు అగ్నిపూతుడు, వాయు పూతుడగును అని చెప్పబడినది అదెట్లో పరిశిలింతము.

అగ్నిచే బంగారములోని మలినము పోయి శుద్ధమగును. బంగారము, వెండి, పగడము మొదలగు వాటిని అగ్నిలో పుటము బెట్టి బంగారు భస్మము, వెండి భస్నము, పగడ భస్మలను తయారుచేయుదురు. ఇవి శుద్ధి జేయుటవల్ల అమృత తుల్యమగును. మహోపయోగము గానుండును. పూతము అనగా పరిశుద్ధమగుట, తూర్పారబట్టుటయని అర్థములు గలవు. వాయువుద్వారా ధాన్యమును తూర్పార బట్టుటవల్ల తాలు, పొట్టు, దుమ్ము ధూళి పోయి పరిశుభ్రమైన ధ్యానము లభించును. అగ్నిపూతమువల్ల, వాయు పూతమువల్ల వస్తువులు ఎట్లుపరిశుద్ధమైనవో అట్లే ఈ నిరాలంబోపనిషత్తును గురుముఖంగావిని, పరిపూర్ణము (నిరాలంబమును) కన్నవారు, వారు తమలోని సర్వ సంశయము, సర్వభయములు, సర్వభ్రాంతులనే మలినములను వదలి పరిశుద్ధుడై జన్మరాహిత్యము పొందునని అగ్ని వాయువుతో పోల్చి చెప్పిబడినది. అంతే గాక జన్మరాహిత్యమువల్ల అతనికి పునరావృత్తి కలుగదు అతనికి పునరావృత్తి కలుగదు. అతడు మరల జన్మించడు, అతడు మరల జన్మించడని నమ్మకము కలుగుటకు రెండు పర్యాయములు నొక్కి చెప్పుబడినది. ఇది నిశ్చయము సత్యము.

కావున చదువరులకందరికి ఈ ఉపనిషత్తును గురుముఖంగా విని, కన గలిగే శక్తిని ప్రసాదించి జన్మరాహిత్యము సిద్ధించునట్లు శక్తి సామర్థ్యములు ప్రసాదించవలసినదిగా మద్గురువులను ప్రార్థిచుచున్నాను. ఇట్లగ్ని పూతము,వాయు పూతమైన తర్వాత శేష జీవితము ఎట్లు గడవవలెనో దానిని ఈ సోపానత్రయమున వివరించబడినది. పరిశీలిద్దాము.

## పరిపూర్ణప్రబోధామృతము సోపానత్రయము

1. "గురు కృపా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః" అని గురుగీతగానం చేసింది. తానే పరమాత్మ స్వరూపుడై నిలుచుటే కదా గురుకృప ప్రథమమున సాధకుడు అఖండ ఎరుకను గుర్తించిగాని పరిపూర్ణమును ఉండజూచుకొనుట పొసగదు. అందువల్ల పరిపూర్ణభావమును ఆ రాధ పరుచుకొనుటకు తాను ఆత్మ స్వరూపుడై నిలుచుట ప్రథమ సోపానము. ఎరుకైనిలుచుటెట్లు ?

మానవుని మనస్సుకు అతీత శక్తులున్నవి. **"మనోహిజతువత్"** అనగా మనస్సు

లక్కవంటిది. లక్కను కరిగించి ఏమూసలోపోస్తే ఆ యాకారము ధరించుటవల్ల యేవస్తురూపమునందు మనస్సు ఏకాగ్రమగునో ఆ వస్తు రూపమును ధరించగలదు. ఆ వస్తువు యొక్క స్వరూప స్వభావములు పూర్ణముగా మనసు నందు వ్యాపకము కాగా మనస్సు తన్మయమై బ్రహ్మాకారమే అయిపోవును. ఇదే ఆత్మసాక్షాత్కారము, అఖండ ఎరుక స్వరూప దర్శనము.

శ్రీకృష్ణదేశికేంద్రులవారు **"పిండబ్రహ్మాండలు రెండు"** అనే కందార్థ దర్పణందు మహావాక్యార్థమైన **"తత్వమసి బ్రహ్మ"** ను నెరుగుటకు జహదజహల్లక్షణములచే (భాగత్యాగ పద్ధతుల ద్వారా విరుద్ధాంశములను త్యాగము చేయకుండగనే అఖండార్థము ప్రతిపాదించినారు. ఆపాదమస్తక పర్యంతము తెలియుచున్న వ్యష్టిప్రాణము పిండమని, దాని యందలి వ్యష్టిమనస్సు అహం అని పృథ్వి మొదలు ఆకాశము వరకు తెలియుచున్న సమిష్టి ప్రాణం బ్రహ్మాండమనీ, అందలి సమిష్టిమనస్సు అహం అని ఈ పిండ బ్రహ్మాండములు వీటి అహములు నాలుగు కూడి అఖండమగు ఎరుక రూపగునని సెలవిచ్చియున్నారు. ఇట్లు అఖండ ఎరుక స్వరూపము (ఆత్మ స్వరూపము) ను దర్శనము జేసుకొనుటే తాను ఆత్మ స్వరూపుడై నిలుచుట. ఇదే **మొదటి సోపానము.**

తన స్వరూపమును తా గని తన కన్యముగానున్న పరబయలును అపరోక్షము గావించుకొని ఆరూఢటజెంది ఎరుకను వదులుట బ్రహ్మమునువదులుట **రెండవ సోపానము.**

పరిపూర్ణ పరబయలు తెలియరాని దానిని ఎట్లు కనవలెను ? అంటే పరిపూర్ణపర బయలు నిత్యప్రాప్తము, స్వత సిద్ధము. సద్గురువు మొదట లేనెరుకను గూర్చి క్షుణ్ణంగా వివరించి చూపి అది లేని దేదో అదే పరిపూర్ణ పరబయలని వివరించును. అట్టి లేనెరుకను విడిచితే అంతా పరిపూర్ణబ్రహ్మమే. అట్లు విన్న శిష్యుడు ఆ లేనెరుక స్వరూపుడు తానేనని గుర్తించి ఆ అఖండాత్మ స్వరూపుడు తానేనని గుర్తించుటయే ఆ లేనెరుకను తెలియుట. అట్టిస్థితి యందే తానుగాని తాను లేని పరిపూర్ణ పరబ్రహ్మమున్నది. తానేలేడు అనే యదార్థ జ్ఞానము శిష్యునికి కలుగుచున్నది. అట్లుండ చూచిన తెలివి లేనే లేదని దాని రహితమొనర్చు కొనుటే లేనెరుకతో పరిపూర్ణమును గని పెట్టుట. ఇదే ఎరుకలేక సేవించుట.

జ్ఞాన జ్ఞేయ రూపముగా నున్న తన స్వరూపము కంటే అన్యంగా పరిపూర్ణ పరబ్రహ్మమునందు, తనకు మూలము లేదని, స్థానము లేదని తెలుసుకొని **తానే బ్రహ్మననే భ్రాంతిని పూర్తిగా వదిలివేయుటయే ఎరుకను విడుచుట.** నేను పరిపూర్ణమందులేనని దృఢపడుటయే ఎరుకను మానుట. నేను కనుక లేక వుంటే లేనిమనస్సు లేనే లేదు. మనస్సే సంస్కారముల (సంచిత ప్రారబ్ధ ఆగామిల మూట) జనన మరణములకు బీజము. అట్టి మనస్సు సదాలేకుండా చేసుకొని యుంటే మరణకాలమున వ్యష్టిమనస్సులేకుండటచే వ్యష్టిప్రాణయొక్కటే శరీరమునుండి బటయ పడి బ్రహ్మాండములోని సమిష్టి ప్రాణము చేరి పోవును. తిరిగి జన్మకు వచ్చుటకు అచట సంస్కారములతో కూడిన మనస్సు లేదు

గనుక **"ఈ రెండెన్నడుకలయవోనాడే సున్నసుమీ ఎరుక మాట"** అనట్లుగా తిరిగి జన్మరాదు. ఇదే జన్మరాహిత్యము. మానవుడై పుట్టినందులకు జేయవలసినపని ఇదే, **ఇది రెండవ మెట్టు.** ఇంతటితో పరిపూర్ణ బోధ ముగిసిందని అను కుంటారు. మరొక మెట్టు ఎక్కవలసియున్నది.

పరిపూర్ణ పరబ్రహ్మమునందు ముక్తి చెందుట అనగా నేమి ? **అన్ని గుణములకు భ్రాంతులకు మూలమైన ఈ మూలములేని గుర్తెరిగే శరీరమునకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలము లేదు కొనకు ప్రవేశించెటందును స్థానము లేదని ఆరూఢత చిక్కిన పిమ్మట పరిపూర్ణము వున్నదనిగాని, అందు ఎరుక లేదు అని గాని జ్ఞప్తి అందు ఉంచుకొనక శేష జీవితమును గడుపుట తృతీయసోపానము,** చివరి మెట్టు, పరమపదము. ఎందుకనగా తెలుసుకొన దగిన తెలివిని వదలిన వాడు. ఇక తెలివి ఎక్కడిది ? ఎరుకలేదు పరిపూర్ణము వున్నదనుట ఎరుకవాక్యమేగాదా ! భ్రాంతి రూపములే. కనుక "నిర్ణయమే మహాపాపము" అని దీక్షితుల వారున్ను ఏ నిర్ణయమును చేయదు నేననని మహాత్ముడెపుడు అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు తెల్పియున్నారు.

**శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ దేహోనాస్తి కదాచన।**

**అస్తినాస్తీతి కోవేద । నిర్ణయో నాస్తి సర్వదా॥**

తా॥ అని అచలసిద్ధాంతము. ఆత్మ కతీతమై కేవలాత్మ (పరిపూర్ణ పరబ్రహ్మము, నిరాలంబం) ఒప్పుచున్నది. శరీరాత్మలతో కూడిన దేహమొప్పుడను లేదు. కనుక వున్నదని గాని లేదనిగాని తెలుసుకొనుటకు ఎవరున్నారు. (తెలుసుకొనె తెలివిని ఎరుకను వదిలిన తర్వాత దేనితో ఏదీ తెలుసు కొనుట జరుగదు. అది అట్టి స్థితి) ఎప్పుడు యేనిర్ణయములు లేవు అని భావము. ఇట్టి ఆరూఢతయే పరిపూర్ణ పరబ్రహ్మము నందు కూడా ముక్తి జెందుట.

**కం॥ 229 "ఇది తప్పుయేమిలేదని । మొదటిది మొరపెట్టుచుండు ముదమున వినుమా। యిది యేవి లేదు పొమ్మని వదలక రెండోది లెస్స । వదురు చుండును రా। బయలెరుకాల నిది నిశ్చయమురా । అదిగాక నీ రెంట్ని నరసి నీ విప్పూడు। విదితముగా రెంట్ని విడరా మంత్రము లిట్లు...."** ఈ సిద్ధాంత వాక్యములను అనగా ద్వాదశి షోడశి మంత్రములను పరిశీలించిన పిమ్మట ఆ వాక్యములను విడిచి వేయవలసిన దేనని శ్రీకృష్ణదేశుకుల వారు తెలుపుచున్నారు. ఈ రెండు మంత్రముల చివర యేమిలేదు, యేమి లేదు అని యుండుట లోని పరమార్థము కూడ వాటిని చివరకు వదల వలసినవే అని చెప్పుచున్నవి. ఏమి లేదనే భావనలో యుండుటయే. ఎందుకనగా యెరుకకు మూలములేదు. కనుక అదియేమి లేనిది. ఎరుకను వదిలిన తర్వాత ఇంకేమియున్నది. ఏమిలేదు. అంతేగాక శ్రీ శివరామ దీక్షితులవారు బృహద్వాసిష్టము అఖండానుభవ రహిత ప్రకరణమునందు, **"సర్వ కాలము యెరుకకు వెరచి పరిపూర్ణమును అవలంబించితే**

**చాలు, ఒొక్కటే వ్యవహారము, అంతా తానే, తానే అంతా 100 అంతా తానే అని దేహ పతన పర్యంతం యిలాగు యుక్తి యుంటే వ్యవహారానకు పనిలేదు. యిది సిద్ధాంతం, యిదే సత్యం, యిదే మహా రహస్యం, మహా గూఢం యేమిలేదు".** అని సిద్ధాంతీకరించియున్నారు. ఇచట యేమి లేదు అనుటలో గూడ శాశ్వత మైన పరిపూర్ణ పరబ్రహ్మమందు, అశాశ్వతమైన ఎరుకకకు మూలం లేదు. నిలిచే అందుకు స్థానము లేదని దృఢపడిన తర్వాత తెలియదగినది యేమిలేదు. ఎందుకనగా ఎరుకను (తెలివిని) ను వదిలి వేయబడినది. ఏమన్న వున్నదని అంటే భ్రాంతి, ఎరుక మళ్ళి ఆవరించినట్లే. కనుక పరిపూర్ణమందు తనకు మూలము లేదని ఆరూఢ పరుచుకొని, తానుఒక్కియని కని ఏ నిర్ణయము లేక అశరీర పద్ధతితిలో నుండి దివ్యమైన శేష జీవితముగడువుట **తృతీయ సోపానమూ.**

ఇదే అంతిమ సోపానము. ఈ సోపానము గురుడు శిష్యునికి చివర ప్రసాదించు అంతిమ ప్రసాదము. దీని తర్వాత ఇంకేమి లేదు. ఏమి లేదు, ఏమి లేదు, ఏమి లేదు...

శాంతి మంత్రము

**శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణత్ పూర్ణము దచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావ శిష్యతే ॥**

ఓం శాంతిః శాంతిః శాంతిః

(చివర ఈ శాంతి మంత్రము తప్పక చదువవలెను.)

మహబూబ్‌నగరము జిల్లా నవాబుపేట మండలము **ఇప్పటూరు** గ్రామ వాస్యవ్యులు కురువిణశెట్టి (జేంద్ర) వంశజులు సిద్ధాంతముని (మేణును) గోత్రీకుడు **కీ.శే. మంత ఎల్లప్ప మంత చిన్నమ్మ** పుణ్యదంపతుల ద్వితీయ పుత్రుడు **శ్రీ మదచలర్షి ప్రబోధానంద మల్లు వెంకట రెడ్డాఖ్య దేశిక ప్రభువుల ప్రియ శిష్యుడు మంత చిన్నయ్యచ** 12 శ్లోకములకు భావార్ధములు కూర్చబడిన నిరాలంబోపనిషత్తు సర్వం సమాప్తము.

సర్వం శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు.

